INTEGRITUS
GUARANTEED FOR 1/10 ROLLED GOLD
COLLAR PINS
MADE IN ENGLAND
FOR SMART WEAR
SOLE AGENTS FOR INDIA, BURMA & CEYLON.
SHA GULABCHAND MOHANLAL
1st SHOP NARAYANA MUDALI ST., MADRAS

# ఆంధ్రపత్రిక

మదరాసు రేసులు
1949-50
నవంబర్ మీటింగు
ఆదివారము 27-11-1949
"ది రేస్ క్లబ్ కప్"

317589

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 230 WEDNESDAY 23rd NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఒక్క సంవత్సరం వ్యవధి కావాలి

## సైన్యంలో కులమతవర్గ రాష్ట్ర విభేదం రద్దు

### భారత సర్వసేనాని ప్రసంగం

పూనా, నవంబర్ 21: సైన్యంలో, మద్రాసు రెజిమెంటనీ, గూర్ఖా రెజిమెంటనీ, మరాటా రెజిమెంటనీ, శిక్కు రెజిమెంటనీ–ఈ విధమైన, కుల మతవర్గ రాష్ట్ర వివక్షతలు రద్దుచేసి, మొత్తం సైన్యానికంతా 'హిందూస్థానీ ఫౌజు' అనే ఒకేపేరు పెట్టడానికి ప్రభుత్వం తీవ్రంగా ఆలోచిస్తున్నది' అని భారత సర్వసేనాని జనరల్ కరియప్ప, మాజీసైనికుల యోగక్షేమ విచారణ సమావేశానికి ప్రారంభోత్సవం చేస్తూ ఆదివారంనాడు సతారాలో ప్రకటించారు.

సర్వసేనాని పూనానుంచి మోటారులో సతారా రాగానే, జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానంద భారతి వారికి స్వాగతమిచ్చారు. సతారా పోలీసులు సైనికవందనాలర్పించారు.

అనంతరం సర్వసేనాని, మోటారులో బయలుదేరి అప్‌సింజ్ అనే గ్రామం వెళ్లారు. కడచిన యుద్ధంలో ఈ గ్రామంలో ఇంటికొక్కరు చొప్పున మొత్తం 360 మంది సైన్యంలో చేరారు. బొంబాయిరాష్ట్రం మొత్తంలో ఏ గ్రామంనుంచి యింతమంది సైన్యంలో చేరలేదు. ఈ గ్రామంలోవున్న మృతవీరుల స్మారక చిహ్నందగ్గిర సేనాని పుష్పహారం సమర్పించారు.

సతారా మునిసిపాలిటీ తరఫున, మునిసిపాలిటీ అధ్యక్షులు ఆర్. యస్. పావర్ కరియప్పగారికి సమర్పించిన సన్మానపత్రంలో, 'ఇక్కడి ప్రజలకు సైనికశాఖ లంటే చాలా ఉత్సాహంవుంది. ఈ పట్నంలోవున్న విద్యార్థులలో 2000 మందివరకూ ప్రతిదినం వ్యాయామవ్యాసంగాలలో పాల్గొంటూవుంటారు. ఒక్క సైనిక శిక్షణా కేంద్రాన్ని స్థాపించాలనే అభిప్రాయాన్ని మీరు బాగా బలపరచాలి. ఇక్కడ శిక్షణ కేంద్రాన్ని స్థాపించితే, యం. యస్. యం. రైల్వే లైనుమీదవున్న, కేల్వాపూర్, పోలా

(2-వ పేజీ చూడుడు)

## ముక్డెన్లో అమెరికన్ కౌన్సల్ అరెస్టు

### పెకింగ్ ప్రభుత్వ చర్యను ఖండించవలసిందిగా వివిధదేశాలకు అచిసన్ విజ్ఞాపన

వాషింగ్టన్, నవంబరు 21: అమెరికా ప్రభుత్వ కార్యదర్శి డీన్ అచిసన్ 30 మంది విదేశ రాయబారులకు ఒక విజ్ఞప్తి చేశారు. ఆ విజ్ఞప్తిలో, అమెరికా రాయబార కార్యాలయాధికారిని చైనా కమ్యూనిస్టులు చాలాకాలంనించి నిర్బంధంలో ఉంచారనీ, ఆ విషయంలో ఆయాదేశాలు కమ్యూనిస్టు ప్రభుత్వానికి తమ ఆందోళన తెలియజెయ్యవలెననీ ఉన్నది.

మొన్న అక్టోబరు 24 న రాయబార కార్యాలయాధికారి, అంగస్ వార్డును, అతని క్రింద పనిచేస్తున్న 4 గురు ఉద్యోగులను ఒక చైనీయుని కొట్టారనే నేరం మీద చైనా కమ్యూనిస్టులు నిర్బంధించారు. చైనా కమ్యూనిస్టులతో రాయబార సంబంధాలున్న ప్రభుత్వాలన్నిటికీ డీన్ అచిసన్ విజ్ఞప్తి అందచేశారు. చైనా కమ్యూనిస్టులు అంగస్ వార్డును, అతని అధికారులను ఖైదు చెయ్యడం అంతర్జాతీయ ప్రాథమిక న్యాయసూత్రాలకు వ్యతిరేకమని ఆ విజ్ఞప్తిలో ఉన్నది. అమెరికా రాయబార కార్యాలయం ఇండియా, టర్కీ, గ్రీసు, బ్రిటను, రష్యా, కెనడా మొదలైన దేశాల రాయబార కార్యాలయాన్నిటికీ ఈ విజ్ఞప్తి పంపించింది.

ఈ విషయంలో డీన్ అచిసన్ ఇలాగ అన్నారు. "మీ ప్రభుత్వాలన్నీ చైనా కమ్యూనిస్టు ప్రభుత్వానికి ఈ విషయంలో తమకు కలిగిన ఆందోళన తెలియజెయ్యగలరని భావిస్తున్నాను. ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయం.

మా రాయబార కార్యాలయోద్యోగులు చాలాకాలంనించి ముక్డెన్‌లో ఉంటున్నారు. 1949 జూన్ లో కమ్యూనిస్టు ప్రభుత్వం వారును, ఆయన అనుచరులను ముక్డెన్ విడిచిపోవడానికి సౌకర్యాలు కలిగిస్తానని అన్నది. కాని ఇంతవరకు అలాంటి ఏర్పాటులేవీ చెయ్యలేదు. పైగా మొన్న అక్టోబరు 24 న కమ్యూనిస్టు రేడియో, వార్డు, అతని అనుచరులు, నిర్బంధించబడ్డారని ప్రకటించింది. ఏ కారణంవల్ల నిర్బంధించారనివారు తెలిపింది ముక్డెన్‌లో ఉండే అధికారులు అమెరికా రాయబారులు తమ విషయమై నివేదిక పంపించడానికిగూడా, అనుమతించలేదు. ఇంక ముక్డెన్‌లో మిగిలిన అమెరికా ఉద్యోగులు వార్డుకుగాని అతని, అనుచరులకుగాని ఏ విధంగా నూ సహాయం చెయ్యడానికి వీలులేకపోయింది.

ఈ విషయంలో కమ్యూనిస్టు చైనా ప్రభుత్వం దగ్గిరనించి అమెరికా ప్రభుత్వానికి ఏవిధమైన వర్తమానము రాలేదు. మాకీ విషయాలన్నీ రేడియో వార్తలవల్లనే తెలిశాయి. పెకింగులో ఉన్న అమెరికా రాయబార కార్యాలయం వీటిని విచారించాలని ప్రయత్నించింది కాని ఆప్రయత్నాలేమీ ఫలించలేదు."

## ఢిల్లీవర్గాల అభిప్రాయం

### కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానంపై కేంద్ర ప్రభుత్వ పరిశీలన

### కొత్తరాష్ట్రానికి కేంద్రంనుండి ఆర్థిక సహాయం లభింపబోదని సూచన

**న్యూఢిల్లీ, నవంబరు 21: ఆంధ్రరాష్ట్రనిర్మాణం ఇంకో సంవత్సరానికిగాని పూర్తికాదని లాబీవర్గాల ద్వారా తెలుస్తున్నది.**

**భారతప్రభుత్వం ప్రస్తుతం కాంగ్రెస్‌కార్యవర్గం ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని పురస్కరించుకొని ఆమోదించిన తీర్మానాన్ని పరిశీలిస్తున్నది. త్వరలో వారుఏదో ఒకనిర్ణయానికి వస్తారని గూడా లాబీవర్గాలవారు అంటున్నారు.**

ఈలోపల ఇట్లా ప్రత్యేక రాష్ట్ర నిర్మాణంవల్ల వచ్చే ఆర్థికమైన ఇబ్బందులనుగూర్చి కేంద్రప్రభుత్వం సమగ్రపరిశీలన జరిపించ నిశ్చయించుకొన్నది.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడితే అది స్వయంపోషకంగా వుండగల్గుతుందా అన్న విషయం తీవ్రమై చర్చలకు గురియౌతున్నది. ఏది ఏమైనా కేంద్రం మాత్రం ఆర్థికంగా ఏ రాష్ట్రానికి ఎటువంటి సహాయమూ చేయజాలదు లేదన్న విషయం స్పష్టంగానే కన్పిస్తున్నది.

మామూలుగా తీర్మానంలో వున్నవిధంగా ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాల సరిహద్దులను నిశ్చయించేందుకు ఒక సరిహద్దు సంఘాన్ని ఏర్పాటు చేయవలసివున్నది. అందువల్ల ఇవ్వన్నీ పూర్తి అయ్యేటప్పటికి ఎట్లా లేదన్నా ఒక సంవత్సరం పడుతుంది అని లాబీవర్గాలవారు అంటున్నారు. (స్వ. వి.)

### పటేల్, నెహ్రూలతో రంగా గారి సంప్రతింపులు

చెన్నపట్నం, నవంబరు 22: ఆంధ్ర కాంగ్రెస్ సంఘ అధ్యక్షులు ఆచార్య రంగాగారు ఢిల్లీనుంచి ఈరోజు ఉదయం ఇక్కడికివచ్చి ఈసాయంత్రం నిడుబ్రోలు వెళ్లిరి. వీరు ఢిల్లీనుండి బయలుదేరుటకు పూర్వం పండిట్, నెహ్రూ, సర్దార్ వల్లభాయ్‌పటేల్ గార్లను కలుసుకొని ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం విషయంలో రాష్ట్ర కాంగ్రెస్ చేసిన సూచనలనుగురించి సంభాషించినట్లు తెలుస్తున్నది. ఈరోజు జరిగే కేంద్ర మంత్రివర్గ సమావేశంలో ఈ విషయం చర్చకు రాగలదని ఒక నిర్ణయంకూడా జరుగగలదని తెలుస్తున్నది. మొదటి షెడ్యూలులో ఆంధ్రను చేర్చుటకు వీలుగా నవంబరు 26 లోపునే ఆంధ్రరాష్ట్ర స్థాపనగురించి ఉత్తరువు జారీకాగలదని తెలుస్తున్నది. కేంద్ర ప్రభుత్వం నూత్నరాష్ట్ర ఆర్థికస్తోమతును పరిశీలించి, ఇందుకు సంబంధించిన వివరాలను సేకరించడానికిగాను చెన్నరాష్ట్ర ప్రభుత్వానికి ఒక ప్రశ్నావళిని త్వరలోనే పంపనున్నట్లుకూడా తెలుస్తున్నది.

## కర్ణాటక రాష్ట్రం

### మొదటి షెడ్యూల్లో ఇప్పుడే చేరాలి

ఏకీకరణ సమితి తీర్మానం

బళ్లారి, డిసెంబర్ 21: నూత్న భారత రాజ్యాంగపు మొదటి షెడ్యూలులో కర్ణాటక రాష్ట్రపు పేరును తక్షణమే నమోదు చేయాలని, బళ్లారి జిల్లాను విడదీసి ఆంధ్ర రాష్ట్రంలో చేర్చరాదని తీవ్రంగా ఉద్ఘాటిస్తూ, కర్ణాటక ఏకీకరణ సమితి వారు నిన్న సాయంత్రం ఇక్కడ జరిపిన బహిరంగ సభలో తీర్మానింపబడింది.

బళ్లారి జిల్లా ఆంధ్ర రాష్ట్రంలో చేర్చబడే పక్షంలో కన్నడిగలు కాంగ్రెసునుండి రాజీనామా యిచ్చి సత్యాగ్రహోద్యమం లేవదీయాలని ఉద్ఘాటిస్తూ పలువురు ప్రసంగించారు.



## మద్రాస్ రాష్ట్రంలో కొచ్చిన్ తిరువాన్కూర్ విలీనం చేయాలి

### మలబార్ జిల్లాకాంగ్రెస్ తీర్మానం

కలకత్తా, నవంబరు 21: కొచ్చిన్ తిరువాన్కూర్ యూనియన్‌ను మద్రాసు రాష్ట్రంలో కలిపివేయాలని కోరుతూ, మలబార్ జిల్లా కాంగ్రెస్ సంఘం యీ ఉదయం సమావేశమై తీర్మానంచేసింది.

ఇందుకు అనువైన వాతావరణాన్ని సృష్టించాల్సిందిగా మలబార్ ప్రజలకు, ముఖ్యంగా కొచ్చిన్ తిరువాన్కూరు యూనియన్ ప్రభుత్వానికి, ప్రజలకు, జిల్లాకాంగ్రెస్ సంఘం తమ తీర్మానం ద్వారా విజ్ఞప్తిచేసింది. ఐక్యకేరళరాష్ట్ర నిర్మాణానికి యీ సంస్థాన యూనియన్ మద్రాసురాష్ట్రంలో లీనమవడం అవసరమని ఉద్ఘాటించింది

## భారతదేశానికి ఎక్కువ గోధుమ

### వాషింగ్టన్ సంప్రతింపులు అంత ఫలప్రదం కాని సూచన: దేశముఖ్ తిరుగు ప్రయాణం

న్యూయార్కు, నవంబరు 20. భారతదేశపు సంచార రాయబారి సర్ సి. డి. దేశముఖ్ ఈవేళ అమెరికానుండి ఇండియాకు బయలుదేరెను. దేశముఖ్ గారు లండన్‌మీదుగా విమానంలో వస్తున్నారు. అమెరికా ప్రభుత్వంతో గోధుమల విషయమై జరుపుతున్న రాయబారాలు ఎక్కువ దూరం సాగినట్లు కనపడదు. అదిగిని 30 లక్షల టన్నుల ధాన్యంలో 3 వ వంతు భాగాన్ని మాత్రమే ఇండియాలో నిలవ చేయడానికి అమెరికా అంగీకరించిందనీ, తక్కిన 2 వంతులను వస్తువినిమయం పద్ధతిగా ఇవ్వాలా లేక ఉచితార్థంగా ఇవ్వాలా అన్నది ఇంకా నిర్ధారణ కాలేదనీ తెలుస్తున్నది.

అమెరికా అడుగుతున్న మాంగనీసు, అభ్రకంఏ ప్రమాణాలలో సప్లయి చేయడానికి వీలవుతుందో తెలుసుకొని రావడానికే దేశముఖ్ గారు ఇప్పుడు ఢిల్లీకి బయలుదేరిరి. ఈ రెండు ఖనిజాలఉత్పత్తిని ఇతోధికం చేయడానికి భారత ప్రభుత్వం

(2-వ పేజీ చూడుడు)

## హేగ్ ఒడంబడికకు ఇండొనీషియా రిపబ్లికన్ పక్షాల ఆమోదం

### బటేవియాకు డచ్ విదేశాంగమంత్రి ప్రయాణం

బటేవియా, నవంబర్ 21: ఇండొనీసియా రిపబ్లిక్‌లోని రెండు ప్రధాన రాజకీయపక్షాలు, తొమ్మిది చిన్నపక్షాలు "హేగ్ ఒడంబడిక"ను ఆమోదించి తాత్కాలిక పార్లమెంటులోని తమ ప్రతినిధులకు ఒప్పందాన్ని సమర్థించవలసినదిగా ఆదేశించినవి. ఈ ఒప్పందాన్ననుసరించి సంయుక్త ఇండొనీసియా వచ్చే నెలలో స్వతంత్ర దేశంగా ఏర్పడుతుంది.

ఒప్పందాన్ని ఆమోదించిన ప్రధాన పక్షాలు ఒకటి నేషనల్‌పార్టీ (సోకర్నో ప్రభృతులు) రెండవది మస్యూమి(ముస్లిం) పార్టీ మస్యూమిపార్టీ దేశంలోని రాజ

2 వ పేజీ చూడుడు)

## ప్రపంచ ఆహారపరిస్థితి

### "కలవారి స్థితి మెరుగైంది, లేనివారి స్థితి అధ్వాన్నమైంది"

### ప్రపంచ వ్యవసాయాహారసంఘ సమీక్ష

వాషింగ్టన్, నవంబరు 21: తిండివున్న వారిపని ఇప్పుడు మరీబాగావుంది. తిండి లేనివారిపని మరి అధ్వాన్నంగావుంది. అని ఐక్యరాజ్యసమితి తాలూకు ఆహార వ్యవసాయక సంఘం తన వార్షికనివేదికలో వెల్లడిచేసింది.

ఈ నివేదికనుపై సంఘంవారు ఇవ్వాళ్టిపై సంఘవార్షిక సమావేశములో సమర్పిసారు.

వీరు ఈ నివేదికలో తెలియజేసిన ముఖ్యవిషయాలు ఇవి:–

సమశీతోష్ణమండలంలోను, ఉష్ణమండల ప్రదేశంలోను పంచదార, క్రొవ్వుపదార్థాలు, చేపలు, పసుమాంసం పళ్ళు కూరలు బాగా అభివృద్ధి అయినాయి.

కాని ఇందువల్ల దళితదేశాలకు కల్గిన లాభం ఏమీలేదు, పూర్వం ఎంత బీదరికాన్ని వీరికష్టాలు మొత్తాలు అనుభవించారో, వీరుగూడా అంతే బీదరికాన్ని అనుభవిస్తున్నారు.

కాని ఇందులో కొన్ని దేశాల్లో పంచదార వాడకం ఎక్కువైంది.

అయినా పేదదేశాలకు, ధనికదేశాలకు మధ్యవున్న జీవన ప్రమాణాంతరం సమతూకంలో వచ్చిన దాయలు ఎక్కడా కనిపించడం లేదు. పైగా ధనికదేశాలు మరీ ధనవంతమున్నూ, పేదదేశాలు మరీ దరిద్రమున్నూ అయిపోతున్నాయి.

కాగా ఇప్పుడు ప్రపంచాన్ని ఎదుర్కొంటున్న ఆహారసమస్యను తేల్చడానికి రెండుమార్గాలు వున్నాయి. ఒకటి, వెనకబడివున్న దేశాల అభివృద్ధికి అవసరమైన సాంకేతిక సహాయం చేయడం; రెండు, ఉత్పత్తి; ద్రవ్యం వీటివల్ల ఏర్పడే అవరోధాలను అధిగమించి వ్యవసాయిక పదార్థాలలో వ్యాపారాన్ని ఇనుమడింపచేయడం.

1948-49 లలో ఒక్క ఆస్ట్రేలియా, న్యూజిలాండులలో తప్ప తక్కిన అన్ని ప్రదేశాల్లోను ఆహారోత్పత్తి ఎక్కువ అయిందనే చెప్పాలి. అట్లా ఆహారధాన్యాల సరఫరా గూడా అన్ని ప్రాంతాల్లోను ఎక్కువే అయింది.

కాగా ఆహారధాన్యాలలో వర్తకం అమెరికా కెనడాలలో ఎక్కువగా వుంది. అవి పూర్వం మొత్తం ప్రపంచం ఆహారధాన్యాల ఎగుమతులలో 1/7 వంతు చేస్తూవుండేవి. ఇప్పుడు అది 1/5 వంతు దాకా పెరిగింది.

అంటే, తక్కిన అన్ని దేశాలు తమ ఆహారపదార్థాలకోసం డాలర్ దేశాలమీద ఆధారపడి వుంటున్నాయని తేలుతున్నది. అందువల్ల డాలర్ కొరతగూడా ఏర్పడుతున్నది.

కెనడా అమెరికాలు రెండు అసవర సమయాల్లో ప్రపంచాన్ని ఆదుకొన్నందువల్ల ఆదేశాలలో తలపెట్టించిన ఆహారధాన్యోత్పత్తి జరిగి వాటికి అది ఒక సమస్యగా ఏర్పడుతున్నవి. అందువల్ల అవి వాటి ఉత్పత్తిని అరికడదామనుకుంటున్నాయి.

పోతే, ఇతరదేశాలు కొన్ని తమ ఉత్పత్తిని ఒక ప్రమాణానికి తీసుకుపోవాలని ఆలోచిస్తున్నవి. ఈ ప్రయత్నంలో అవి ఎగుమతులను ఎక్కువచేసుకొని, దిగుమతులను సాగినంతవరకు తగ్గించుకుంటున్నాయి.

అందువల్ల అమెరికా మొదలైన దేశాలు అమ్ముడుపోని పదార్థాల ఉత్పత్తిని తగ్గిస్తున్నాయి. వాటిని కొనేస్తోమతలేని దేశాలు, కొనలేనిస్థితిలోపడి దిగుమతులను తగ్గించుకుంటున్నాయి.

ఇప్పుడు కొన్ని దేశాల్లో అదనంగా మిగులుతున్న ఆహారధాన్యాలనుకొని, లేని దేశాలకు సరఫరా చెయ్యడానికి క్రయవిక్రయశాల్లను పెట్టాలనే సూచనగూడా ఈ నివేదికలో వుంది.

## మధ్యప్రాచ్యంలో అమెరికన్ అధికారుల సభ

వాషింగ్టన్, నవంబరు 21:— అమెరికన్ విదేశాంగశాఖా సహాయమంత్రి మధ్యప్రాచ్యంలో ఉన్న అమెరికన్ రాజకీయోద్యోగుల సమావేశానికి అధ్యక్షత వహించే నిమిత్తం నేడు ఇస్తాంబూల్‌కు బయలుదేరారు.

ఆనందసుధ
కండ పుష్టికి
వీర్య వృద్ధికి
శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి & సన్సు
రాజమండ్రి

ఖచితముగా నిర్మింపబడిన
"భారత్"
కాఫీ గ్రయిండరు
సోల్ ఏజంటు:
ఎం. రామయ్య
యింజనీర్, మెషినరీ యింపోర్టర్,
శ్రీ కృష్ణ బిల్డింగ్సు,
అవెన్యూరోడు,
బెంగుళూరు సిటీ.

రూపాయ విలువ తగ్గింపువల్ల
ఖరీదు 5% పెరిగింది.
అయినా మునుపటి ధరలకే ఇవ్వబడుతున్నవి.
10A 11B 12C
5 రాళ్ల క్రోంకేసు రు 35/- రోల్డుగోల్డు రు 40/-
7 ,, ,, రు 40/- ,, ,, రు 48/-
15 ,, ,, రు 55/- ,, ,, రు 70/-
నెం. 10A బొమ్మకది రాళ్ల రు 14/8-
మేలుకొలం రు 16/- అలారం టైంపీసు రు 13/-
మంచిది రు 16/- రిపేర్ రు 18/
ఒకేసారి 3 వాచీలు కొనిన రూపాయికి
2 అణాలు వంతున కమీషను యివ్వబడును.
H. DAVID Co.,
Post Box No. 11424, Calcutta.

# కవిబ్రహ్మ స్మారక దినోత్సవం

## నిడుబ్రోల్లో నవంబరు 25 న

తెనాలి, నవంబరు 20: ఆవులగోపాల కృష్ణమూర్తిగారిట్లు వ్రాసిరి. కవిబ్రహ్మ ఏటుకూరి వెంకటనరసయ్యగారి స్మారక సభ మద్దిరాల బలరామ కృష్ణయ్యగారి అధ్యక్షతను రేపు 25 వ తేదీ సాయంత్రం 5 గంటలకు నిడుబ్రోలులో జరుగును. ఇది వరలో ప్రకటించినట్లు 24 న కాదు. మిత్రులు, అభిమానులు యీమార్పును గమనించవలెనని ప్రార్థన.

# సభలు-సమావేశాలు

ఆంధ్రరాష్ట్ర షాప్ ఎంప్లాయిస్ ఫెడరేషన్ మహాసభ డిసెంబరు 4 న తెనాలిలో జరుగును.

ఆంధ్రరాష్ట్ర రజకజన సేవాసంఘ కార్యకర్త సమావేశం విజయవాడలోని రజకపేట బాలికా పాఠశాలలో నవంబరు 27-న జరుగును.

# మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 22:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 77-0-0 పెట్లు బంగారు తులం 114-8-0 మాసబంగారు 112-12-0 సీమవెండి తులం 100-కి (కడ్డీ 170-0-0 వెండి తులం 1 కి 1-12-0

వేరుసెనగ: (531 పా 1-కి ఎక్స్ కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది. 159-0-0,160-0-0 వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (ఫీవరేజి) నవంబరు అండ్ డెలివరి రు. 836- 887

8 టు 5% యస్. యస్. ఎ., కెంకాయనూనె (87 పౌన్లు గల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వీలాన్. రు. 36-12-9, 37-0-0

ఆముదం

కాండి 500 పౌనులుగలది చిల్లరగా రు. 265-0-0

పంచదార

ప్యారీ (2 అందరు) రు. 91-14-6

# న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 21:

డిశెంబరు 29.73 / 29.78 మార్చి 29.74 / 29.75 మే 29.73 / 29.73 జూలై 29.41 / 29.41 అక్టోబర్ 27.98/ 27.98 డిశెంబరు 27.90 / బిడ్ 27.91 అస్కుడ్ మార్చి 27.84 / బిడ్ 27.86 అస్కుడ్ మే 27.79/బిడ్ 27.81 అస్కుడ్.

| | | |
|---|---|---|
| మిడ్లింగ్ | బజారు | 30.83 |
| డిశెంబరు | (గరిష్ఠధర) | 29.73 |
| | (కనిష్ఠధర) | 29.64 |

డిసెంబరు వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | వెల | 29.70 |
| ,, ముగింపు | వెల | 29.73 |

# సైన్యంలో అన్ని విభేదాలు రద్దు

(1-వ పేజి తరువాయి)

పూర్, రత్నగిరి మొదలైన సంస్థానాల కన్నిటికీ కేంద్రంగా వుంటుంది" అని తెలియజేశారు.

కరియప్ప సమాధానం చెబుతూ: "ఈ విషయాన్ని తేల్చవలసినవారు మీ రాష్ట్ర ప్రభుత్వం. అట్లాంటి కేంద్రాన్ని గనుక స్థాపించుకుంటే సైన్యంనుంచి, తగిన సాంకేతికవిద్యా నిపుణులను పంపి సైన్యం సహాయపడుతుంది.

'దేశంయొక్క బలం ప్రజలమీద ఆధారపడివుంటుంది. ఎంతో కష్టపడి సంపాదించుకున్న మన స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవటానికి బలమైన సైన్యాన్ని పెంపొందించుకోవాలంటే, సైన్యంలోకి రాజకీయాలను ప్రాకనివ్వటానికివీల్లేదు. సైన్యంలో, రాష్ట్ర తత్వాలకూ, కులమత విభేదాలకూ, చిహ్నాలుగావున్న పేర్లనన్నిటినీ తొలగించివేసి, మొత్తం సైన్యానికంతకూ 'హిందూస్థాన్‌ఫౌజు' అని పేరు తీవ్రంగా ఆలోచించుచున్నాను.' అన్నారు.

అనంతరం కరియప్ప, మాజీ సైనికుల దొంగతనాలు విచారణా సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు. ఈసమావేశానికి 15,000 మంది ప్రజలు హాజరైనారు. సైనికశాఖ వారు కొన్ని వ్యాయామ ప్రదర్శనాలిచ్చి వారందర్నీ సంతోషపరచారు. సతారాజిల్లాలో పెన్షన్లు పుచ్చుకుంటున్న మాజీసైనికులు మొత్తం 4,000 మంది ఉన్నారు. వైస్‌రాయ్ కమిషండ్ ఆఫీసర్లు శాఖవారు కూడాములో 400 మంది వరకూ వున్నారు. ఈసమావేశంలో కరియప్పగారు, తలకొక 50/- రు చొప్పున 100 మంది వితంతువులకూ, 100 మంది వికలాంగులైన మాజీసైనికులకూ బహుమానాలు పంచిపెట్టారు. ఈ మొత్తాన్నంతా సతారాప్రజలు యీ సమావేశం నిమిత్తం యిచ్చిన 10,000 రూ విరాళాల నుంచీ ఖర్చుపెటారు.

ఈప్రసావేశానికి ప్రారంభోత్సవంచేస్తూ సర్వసేనాని, ప్రాంతీయసైన్యంలో చేరి దాన్ని బలపర్చవలసిందిగా ప్రజలకు హెచ్చరికచేశారు.

# ఆహ్వానానికి రాజాజీ తిరస్కృతి

తిరుపతి, నవంబరు 21:— డిసెంబరులో మద్రాసు వచ్చినప్పుడు తిరుమలలో మంచినీటి సరఫరా అభివృద్ధి స్కీమును ప్రారంభించుటకు రావలసినదని ఆహ్వానింపబడిన గవర్నరు—జనరల్ రాజగోపాలాచారిగారు తాను వచ్చుటకవకాశం లేదని సమాధాన మిచ్చినట్లు తెలుస్తున్నది. అయితే యీస్కీము పూర్తి అయిన తర్వాత మొట్టమొదటసారిగా కొళాయిని త్రిప్పి సరఫరాను ప్రారంభించటం తనకు వీలవుతుందని ఆయన తెలిపినట్లుగా కూడా తెలుస్తున్నది. (స్వ. వి.)

# మలయాకు భారత వస్త్రముల ఎగుమతి

## విశేషంగా హెచ్చినది: ఇంకను హెచ్చు సూచన

సింగపూరు, నవంబరు 21: 1949 సం॥ము సెప్టెంబరుతో అంతమగు మూడు మాసములలో మలయాలోనికి భారతవస్త్రముల, నూలు దిగుమతి అదివరకుకంటె విశేషముగా హెచ్చినది. మలయాలో గిరాకీ యున్న భారతవస్త్రములు హెచ్చుగా రవాణా యగుచుండుటవల్లను, ఇట్టి సరుకులపై భారతప్రభుత్వమువారు ఎగుమతి పన్నును రద్దుచేయుటవల్లను డాలరు ప్రాంతములనుండి దిగుమతులను మలయా తగ్గించుకొనుటవల్లను భారతవస్త్రములు మలయాలోనికి విశేషముగా దిగుమతియైనవి. ఇటీవలమాసములలో మలయా భారతదేశముల మధ్య ఎగుమతి దిగుమతి వ్యాపారము యొక్క విలువ చాలా హెచ్చినది. వస్త్రములు మాత్రమేగాక భారతదేశము మలయాకు మెరియాలు, సుగంధ ద్రవ్యములు, ఇండ్లు కట్టుకొనుటకు పనికివచ్చు పెంకులు, రసాయన ద్రవ్యములు, శిరా, సబ్బులు, విలాసవస్తువులు, నూనెలు, సినిమా ఫిల్ములు, వ్రాత పరికరములు హెచ్చుగా దిగుమతి చేసెను. భారతదేశమునకు మలయా ఎగుమతి చేసిన వస్తువులలో సబ్బుబియ్యము, వక్కలు, కొబ్బెరి నూనె ఎగుమతి తగ్గినది.

డచ్చి-ఇండో నీషియన్ తగాదా పరిష్కారముతో మలయా రేవు వాణిజ్యమునకు జావాద్వారము తెరువబడుటవల్ల మలయాకు భారతదేశ ఎగుమతులు యింకా హెచ్చవచ్చును.

# జర్మనీకి స్వంత సైన్యం ఉండదా?

లండన్, నవంబరు 21: జర్మనీకి ఏవిధమైన సైన్యంగూడా ఉండడానికి బ్రిటన్ సమ్మతించదు. సమ్మతించే ఉద్దేశ్యం యేమాత్రమూ లేదు " అని బ్రిటిష్ విదేశాంగ కార్యాలయోద్యోగి యీ వేళ అన్నాడు. ముందు ముందు జర్మనీ స్వంత సైన్యం యేర్పాటు చేసుకోనివ్వాలా లేదా అనే విషయాన్ని ఎన్నడూ బిటిష్ అమెరికన్ ప్రభుత్వాలు చర్చించనేలేదు. ఇటీవల పారిస్‌లో బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ విదేశాంగమంత్రులు యీ విషయం చర్చించారన్న వార్త అబద్ధం" అని ఆయన అన్నాడు.

త్వరలోనే ఆక్రమణ రాజ్యాలు జర్మనీ గార్డుదళాన్ని సైన్యం యేర్పాటు చేసుకోడానికి అనుమతించవచ్చునని వాషింగ్టన్‌నుంచి ఒకవార్త 'లువడింది' ఈ వార్తపై వ్యాఖ్యానిస్తూ బ్రిటిష్ విదేశాంగ కార్యాలయోద్యోగి పై విధంగా అన్నాడు.

అంతరంగిక రక్షకభటదళం అనే పేరుతో పునః సైనిక ఫలీకరణకు అవకాశమిచ్చే ఆలోచన యేంతమాత్రమూ లేదని తెలియజేశాడు.

# హేగ్ ఒడంబడికకు ఆమోదం

(1-వ పేజి తరువాయి)

కీయపక్షా లన్నిటిలోకీ పెద్దదని కొన్ని ఇండోనీసియన్ భాషా పత్రికలు వ్రాస్తున్నవి. మూడవ పెద్దపార్టీ అయిన సోషలిస్టుపక్షం పార్లమెంటులో తీసుకు నే వోటింగులో పాల్గొనరు కాని ఒడంబడికను ప్రతిఘటించారు.

వచ్చేనెల మొదట్లో ఒడంబడికను స్వీకరించటానికై పార్లమెంటు సర్వసభ్య సమావేశం జరుగుతుందని రిపబ్లికన్ మంత్రివర్గం ప్రకటన చేసిఉన్నది.

తూర్పు ఇండోనీసియా తాత్కాలిక పార్లమెంటు నేడు మకాసర్‌లో సమావేశమై ఒప్పందాన్ని ఆమోదించినది. ఇండోనీసియా సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగము—హేగ్ సమావేశంలో నిర్ణయించబడ్డది—కూడా తూర్పు ఇండోనీసియా పార్లమెంటుచే ఆమోదించబడినది.

ఇండోనీసియాలో 12 రాజకీయపక్షాలున్నవి. ఇందులో కొన్ని పెద్దపార్టీలలోని అంతర్భాగాలే అని చెప్పవచ్చును.

తూర్పుజావా రిపబ్లికన్ సేనాని ఉత్తరువులను ఉల్లంఘించిన వామపక్ష 7 రిజ్మా దళాలు కావిలింపాళ్లలోకి వెళ్ళిపోయినవనీ ప్రస్తుతం పరిస్థితి మామూలుగానే ఉన్నదనీ అక్కడనుంచి వార్తలు వస్తున్నవి.

బటేవియాకుడచ్చివిదేశాంగమంత్రి ప్రయాణం

హేగ్, నవంబర్ 21: డచ్చి విదేశాంగమంత్రి డా॥ స్టికర్, అతని సహాయ మంత్రి త్వరలో బటేవియావచ్చి, వచ్చేనెలలో ఇండోనీసియాకు అధికారంఅప్పగించే తతంగాన్ని చక్కబెస్తారని నేడు అధికారకంగా ప్రకటించబడినది. డచ్చి ఆగ్రదేశాల మంత్రి వీరితోకలిసి రావటంలేదు.

# బ్రిటనుకు ఇండియా ఎగుమతుల తగ్గుదల

## వాణిజ్యమండలి నివేదిక వివరాలు

లండన్, నవంబర్ 22: "1949 జనవరి నుంచీ సెప్టెంబర్ చివరవరకూ ఇండియా నుంచి బ్రిటనుకు వచ్చిన దిగుమతుల విలువ గత సం॥ లో అదే కాలంలో వచ్చిన దిగుమతుల విలువకన్నా 20 లక్షల పౌన్లు తగ్గిపోయినది. ఇండియాకు బ్రిటన్ చేసే ఎగుమతులు మాత్రం జనకటికన్నా మూడోవంతు పెరిగినవి." అని బ్రిటిష్ బోర్డాఫ్ ట్రేడ్ నిన్న ప్రకటించింది.

1949 సెప్టెంబర్ వరకూ బ్రిటనుకు వచ్చిన ఇండియా దిగుమతుల విలువ 6,88,27,621 పౌన్లు. 1948 లో అదే కాలంలో 7,06,83,392 పౌన్ల సరుకులను బ్రిటనుకు తెప్పించుకున్నది. 1949 సెప్టెంబర్ వరకూ బ్రిటన్ ఇండియాకు చేసిన ఎగుమతుల విలువ 9,82,86,957 పౌన్లు. కిందటి సం॥ అదే వ్యవధిలో బ్రిటన్ 6,68,99,309 పౌన్ల సరుకును మాత్రమే ఎగుమతి చేయ కలిగింది.

ఇండియాదగ్గర బ్రిటన్ తేయాకు, పొగాకు, తోలుసామాన్లు, పదును చేయని తోళ్లు, ముడిపత్తి ఎక్కువగా తెప్పించుకున్నది. ముడిజనుము, నూనెగింజలు, చెట్లు జిగుర్లు మొదలైనవాటిని తగ్గించి వేసినది.

బ్రిటన్ దిగుమతు లీకింది విధంగా ఉన్నవి. బ్రాకెట్లలో చూపబడిన అంకెలు కిందటి సం॥ విలువలను లక్షల పౌన్లలో చూపును. తేయాకు 305 లక్షలపౌన్లు (249); పొగాకు 49.4 లక్షలు (20.6); తోలుసామాన్లు 84.6 (56.5) పదును చేయనితోళ్లు 16.8 (8) ముడిపత్తి 12.7 (26.2)

ఈ వ్యవధిలో బ్రిటన్ చేసిన ఎగుమతులు.

యంత్రసామగ్రి 332.5 (276.2) పత్తినూలు గుడ్డలు 107.4 (47.9); పట్టు, మాయపట్టు 22.8 (7.6); మందులు, రంగులు 96.9 (70.6); మోటార్లు, సైకిళ్లు రైలింజన్లు మొదలగునవి 143.4 (100.8); పింగాణి, గాజుసామాన్లు 20.3 (10.2); ఇనుము, ఉక్కువస్తువులు 43.9 (33.3); ఇతరలోహాల వస్తువులు 29.3 (30.3). (గ్లోబ్)

# ఇండియాకు అమెరికా గోధుమ

(1 వ పేజీ తరువాయి)

మార్గాలు అన్వేషించగలదని తెలియనున్నది: దేశముఖ్‌గారు వాషింగ్టన్‌కు మార్చిలో తిరిగివస్తారు.

## ఆస్ట్రేలియా వైఖరి

గోధుమ బోర్డు సభ్యుని ప్రకటన

సిడ్నీ, నవంబరు 21: ఆస్ట్రేలియా గోధుమ బోర్డు సభ్యుడు ఏ. ఏ. ఒస్టెల్ ఆస్ట్రేలియా గోధుమ ధరల విషయమును, సవివరముగా మాట్లాడుతూ ఇట్లనెను: ఆస్ట్రేలియా బ్రిటన్‌కూ ఇండియాకూ 6 కోట్ల 10 లక్షల బుషెల్ల గోధుమను అమ్మడానికి సిద్ధంగా ఉన్నది. బుషెల్ ధర 16 షిల్లింగుల 1 పెన్నీ (అనగా బ్రిటన్ డబ్బులో 12 షిల్లింగుల 8 పెన్నీలు) అనీ, అంతర్జాతీయ గోధుమ ఒడంబడికను పట్టి సందరన ఎంత గోధుమ కావాలో తెలియజేయవలసిందనీ, ఆస్ట్రేలియా బ్రిటన్‌కు 6 వారాల కిందటనే సూచించింది. కాని బ్రిటన్ ఇంకా ఏసంగతీ తెలియజేయలేదు. ఇండియావద్దనుంచి బ్రిటన్‌వద్దనుంచి ఈ ప్రతిపాదనకు డిసెంబరు 1 వ తేదీలోగా అనగా ఇంకో 10 రోజుల్లో సమాధానం రాకపోయినట్లయితే వాని వాటాను కూడా ఇతరులకు పంచి వేయవలసి వస్తుంది అని ఓస్టెల్ ఈ వేళ హెచ్చరిక చేసెను.

"ఇక మరీక్షి ఎక్కువగా ఉన్నదని బ్రిటన్ ఇప్పుడు ఫిర్యాదు చేయడంలో అర్థంలేదు; స్టెర్లింగ్ విలువను తగ్గించే ముందు బ్రిటన్ ఇవన్నీ ఆలోచించుకోవలెను కదా, లేదు. ఏదో విధంగా ఆస్ట్రేలియా గోధుమ ధరలను తగ్గించాలని బ్రిటన్ భారత దేశాలు ఇప్పుడు కుంటి ఏస్తులు వేస్తున్నవి.

అంతర్జాతీయ గోధుమ ఒడంబడికలో నిర్ణయించబడినగరిష్ఠధరకన్న చాలాతక్కువధరకు తమకు గోధుమఅమ్మకం చేయవలసిందని బ్రిటన్ కోరిన కోరికను ఆస్ట్రేలియా తిరస్కరించింది." అని కూడా ఆయన చెప్పెను. బ్రిటిష్ భారత ప్రభుత్వాలు ఆస్ట్రేలియా ప్రభుత్వమునకు గోధుమ ధరల విషయమై అధికార రీత్యా ఇంతవరకు అభ్యర్థన మేదీ పంపలేదని సిడ్నీ హెరాల్డ్ వ్రాసింది.

# సయాం బియ్యం ధర పెరిగే సూచన

బాంకాక్, నవంబర్ 22: బియ్యం దిగుమతుల మీద ఆధార పడుచున్న ఇండియా మొదలైన దేశాలు వచ్చే పంటలో సయాం చేసే ఎగుమతులకు తప్పనిసరిగా ఎక్కువ ధరలు పెట్టవలసి వస్తుంది. రెండు నెలల కిందట సయాం వ్యాపారస్తులు విపరీతంగా ధరలను పెంచగా బ్రిటిష్ ప్రభుత్వం నిష్కర్షగా జేసిన హెచ్చరిక ఫలితంగా సయాం ప్రభుత్వం ధరలను తగ్గించింది. కాని వచ్చే పంటకు ధరలు తప్పనిసరిగా పెరిగే సూచనలు కనిపిస్తున్నవని సయాం వాణిజ్య శాఖా ఉపమంత్రి సూచించాడు.

ఏప్రిల్ నుంచీ ధరలు నాలుగో వంతు పెరగవచ్చునని వాణిజ్య శాఖా సన్నిహిత వర్గాలు తెలియ జేస్తున్నారు. మార్చి వరకూ సరుకు పుష్కలంగా ఉండటంవల్ల ధర తగ్గి సరుకు తగ్గగానే ధరలు పెరగవచ్చును, 1950 లో సయాం 12 లక్షల టన్నులను ఎగుమతి చేయగలదని వాణిజ్య శాఖ వెల్లడించినది. దీని మీద ప్రస్తుత ధరలను పట్టి సయాం 42,85,700 పౌన్లను సంపాదిస్తుంది. (గ్లోబ్)

# కొరుకొల్లులో పోలీసుల కఠిన చర్యలు

## అరెస్టయిన కమ్యూనిస్టు పరారీఅయిన దాని ఫలితం

భీమవరం, నవంబర్ 20: భీమవరం వద్ద కొరుకొల్లులో గడిచిన 9 వ తేదీన పోలీసువారు అరెస్టుచేసినట్టి తూర్పుగోదావరికి చెందిన కమ్యూనిస్టు నడింపల్లి సుబ్బరాజు కాదనీ, పశ్చిమ గోదావరిజిల్లా కమ్యూనిస్టునాయకుడు ఉద్దరాజు రాము రాజు అను వదనీ తెలుస్తున్నది. పోలీసుల నడ్డగించి రామరాజును 40 మంది కమ్యూనిస్టులు విడిపించుకొని, పోలీసులను గాయపరచిన సందర్భంలో, పోలీసులు కొరుకొల్లులో పదవ తేదీనుంచి మకాం చేసి కఠినచర్యలు తీసుకుంటున్నట్లు కూడా తెలిసింది.

పోలీసుచర్యల మూలంగా భయపడి చుట్టుప్రక్కల పాలినాలిజనం అందరూ కొరుకొల్లుకు రావటానికి భయపడుతున్నారనీ, పోలీసువారు ఇలా భీభత్సం కలుగ జేయకుండా ఉత్తర్వు చేయవలసిందని గ్రామప్రముఖులు జిల్లా కలెక్టరుకు అర్జీలు పెట్టుకున్నారనీ, కూడా తెలిసింది. (స్వ. వి.)

# బీబీనగరకేసు

## దర్యాప్తు అధికారి విచారణ

బీబీనగర్ కేసును విచారిస్తున్న ప్రత్యేక న్యాయ విచారణసంఘంవారు 21 న సమావేశమై కేసు దర్యాప్తు అధికారి గౌస్ మహమ్మద్‌ఖాన్‌ను పరీక్షచేశారు.

1949 ఏప్రిల్‌లో క్రయిముశాఖ సూపరింటెంటు ఆర్. బి. ద్వారకనాథ్ ఆదేశాన్ని అనుసరించి తాను బీబీనగర్ కేసును గురించి దర్యాప్తు చేశాననీ, బీబీనగర్ గ్రామం వెళ్లి తగులబెట్టబడిన యింటిని పగలగొట్టబడిన యిళ్లను చూశాననీ చెప్పెను, తాను ఒక 'పంచనామా' కూడ ఏర్పాటు చేశానెను. అతని దర్యాప్తు 1949 జూలై 30 కి పూర్తి అయింది. అప్పుడు అతడు ముద్దాయిలపై చార్జిపత్రం దాఖలు చేసెను. డిఫెన్సు క్రాసు పరీక్షవారడుగగా సాక్షి, రాములమ్మ, గురవయ్యల ముఖము, కదలికలను వర్ణించెను. అస్వస్థతవల్ల వీరు కోర్టుకు రాలేదు. కోర్టుముగిసేసరికి దర్యాప్తు అధికారిని క్రాసుపరీక్ష చెయ్యటం పూర్తికాలేదు.

# తెనాలి రివాల్వరు కేసు

## ముద్దాయిలపై ఛార్జిషీటు దాఖలు

తెనాలి, నవంబరు 16: ఇదివరలో ఇక్కడ రివాల్వర్లు దొరికిన సందర్భంలో వేల్పూరి నాగభూషణం, ఆళ్ల సుబ్బారెడ్డి మున్నంగి మున్నయ్య) స్థానికసర్కిల్ ఇనస్పెక్టరు బి. వీరాస్వామి నాయుడుగారు స్థానిక అడిషనల్ ఫస్టుక్లాసు మేజస్ట్రేటు కోర్టులో ఇం. పీ. కో. 120 ఆయుధచట్టం 19 సెక్షన్ల ప్రకారం చార్జిషీటు దాఖలుచేశిరి.

రివాల్వరు కేసు ముద్దాయిలు

జామీనుపై విడుదల

లోగడ తెనాలిలో దొరికిన రివాల్వర్ల కేసు సందర్భంలో అరెస్టు జేయబడిన మున్నంగి మున్నయ్య ఆళ్ల సుబ్బారెడ్డి, నాగభూషణం అనువారలను, జామీను పై విడుదల గావించిరి.

దొంగకు శిక్ష

మొన్న రాత్రి ఇక్కడ పెద్దబజారులో వెంకటింటిమీద కెక్కి లోనికి దిగి దొంగతనం చేయుటకు ప్రయత్నించుచున్న మానవరం వాస్తవ్యుడు మస్నెం వీరయ్య అనువానిని పోలీసువారు, కావలావారు పట్టుకొన్నారు. పోలీసువారు ఇతనిపై కేసుపెట్టగా డిప్యూటీ కలెక్టరు నిందితునికి 1 సంవత్సరం కఠిన శిక్ష విధించిరి. (స. వి.)

పిఠాపురం బజారులో క్రొత్తగా పోస్టాఫీసు పెట్టారు.

# రేడియో ప్రోగ్రాములు

నవంబరు 24 గురువారం

## మద్రాసు (ఎ)

ఉ. 7-30 ఎం. మణిభాగవతంకీర్తనం పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం (రి.) 8-30 మద్రాసు (బి) వలె. మ. 1 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం (రి.) 4.30 పాశ్చాత్య సంగీతం (రి.) సా. 5-30 వి. మాణిక్యం నాదస్వరం. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 శారదా శంకర్ పాట. 7 ప్రశ్నోత్తరముల కార్యక్రమం. నిర్వహణ, కె. బి. రామస్వామి. 7-30 గీతమంజరి (రి.) 7-45 మద్రాసు (బి) వలె. 8-15 రాగం, తానం, పల్లవి, బుదలూరు కృష్ణమూర్తిశాస్త్రి, గోటువాద్యం. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 ఆటల సమీక్ష. ఎ. కె. సింగ్. 9-30 మద్రాసు (బి) వలె. 10 పాశ్చాత్య సంగీతం (రి.)

## మద్రాసు (బి)

ఉ. 7 తెలుగున వార్తలు. 7-15 ఎం. ఎస్. సుబ్బులక్ష్మి రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 సి. సుబ్రహ్మణ్యపిళ్లె వయొలిన్. మ. 12 కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు ఎవరేమి చేస్తారు, ఓడలో స్టూవర్టు ప్రసంగం. సంగీత పాఠాలు. 1 మహిళామండలి పరివర్తనం. చిన్నకథ, వాద్యసంగీతం. ఆరోగ్యమే మహాభాగ్యము. పరిశుభ్రత, డాక్టరుగారి ప్రసంగం. 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నతపాఠశాలా విద్యార్థులకు రాజకీయ విప్లవములు, గాంధి విప్లవము, ప్రసంగం. మహాత్మాగాంధి నిర్మాణ కార్యక్రమం. జాతీయభావ ప్రసంగం. 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు పంచదార తయారుచేశాలు జర్మనీ, ప్రసంగం. ప్రశ్నలు, జవాబులు, ఆటపాటలు. సా. 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయంసంగీతం. (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం. అనవేరా కృష్ణశాస్త్రి గేయం. చిన్నా నాటిక. విశేషాలు, ప్రకటనలు, ధరలు, వాతావరణ వివరాలు. 7-0 తెలుగున వార్తలు 7-15 గీతావళి 7-45 కాలజ్ఞానము. కాళ్యదృష్టి ప్రసంగం వేదులపల్లి కృష్ణశాస్త్రి 8-0 ఆంధ్రదేశ జానపదగేయాలు. 8-15 మద్రాసు (ఎ) వలె. 9-30 తిరుపతి ఎస్. కృష్ణమూర్తి పాట. 10-0 సినిమా సంగీతం (రి).

## విజయవాడ

ఉ 7-0 తెలుగున వార్తలు 7-15 వివిధ కళాకారుల రికార్డులు. 7-30 గరిమెళ్ళ శ్రీరామమూర్తి వయొలిన్. 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 కేనాపు స్లాట్ నిలయ విద్వాంసులు 8-30 నూకల సత్యనారాయణ పాట. మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1-0 తారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు. 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు సా 5-30 నూకల సత్యనారాయణ పాట. 6-0 ఆంగ్లమున వార్తలు 6-20 గీతమంజరి. ఘంటసాల వెంకటేశ్వరరావు రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసు నుండి) 7-0 తెలుగు వార్తలు. 7-30 కొత్తపాటి వెంకటేశ్వరరావు పాట. 7-45 మద్రాసు వలె. 8-0 పెళ్లికొడుకు కల నాటిక. రచన వింజమూరి శివరామారావు 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా. 8-30 కల్లలరి ప్రోతలు కోరిన పాటలు 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 చిత్రవాణి రికార్డులు. 9-30 గరిమెళ్ల శ్రీరామమూర్తి వయొలిన్.

## హైద్రాబాదు

ఉ॥ 7-30 అజ్మత్ హుస్సేన్‌ఖాన్ సుభా కారాగ్ 8-0 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే) 8-20 వి. భాగ్యలక్ష్మి కర్నాటక సంగీతం 8-50 తెలుగునవార్తలు. 9-15 కనీజ్ ఫతీమా దాద్రా ఘజల్ మ॥ 12-30 ఘజల్ రికార్డులు. 1-0 కృష్ణప్రేమ రికార్డులు. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే) సా॥ 5-0 అజ్మత్ హుస్సేన్‌ఖాన్ ఖయాల్ ధనశరి 5-25 రాయున్న క్లారినెట్, 5-35 కనీజ్ ఫతీమా ఘజల్ గీత్. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. తెలుగున సహకార సంస్థలు (4) సహకార మార్కెటింగు ప్రసంగం. భారత వాతావరణ పరిస్థితి. 7-0 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే) 7-15 హాస్యగీతాలు. వెంకట నరసింహాచారి ఎం. వెంకట్రాజు మహాపురుషులు (10) శంకరాచార్య ప్రసంగం. ఎస్. సూర్యనారాయణమూర్తి 7-55 కనీజ్ ఫతీమా గీత్ 8-30 వి. భాగ్యలక్ష్మి కర్నాటక సంగీతం. 9-0 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే) 9-15 అజ్మత్ హుస్సేన్ ఖాన్ ఖయాల్ ఆనంది 9-55 కనీజ్ ఫతీమా గీత్ 10-10 అజ్మత్ హుస్సేన్ ఖాన్ ఖయాల్ శంకర 10-30 ముంతాజ్‌ఖాన్ గానే రికార్డులు.

అతను డాల్డాతో తయారు చెయబడిన ఆహారమును తింటాడు
—అది అతను ప్రతిరోజూవాడే శక్తిని తిరిగి తెప్పెకొనుటకు సహాయపడును!
DALDA VANASPATI
VM. 182-193 TL

# "రెవిన్యూబోర్డును రద్దుచేయడం ప్రస్తుతం సాధ్యంగాని పని"

## ప్రభుత్వం అవసర కార్యాలపైన్నే డబ్బు ఖర్చుచేస్తున్నదని ఆర్థికమంత్రి ప్రకటన

### సప్లిమెంటరీ బడ్జట్‌పై విమర్శకు శ్రీ గోపాలరెడ్డి జవాబు

చెన్నపట్నం, నవంబరు 21: మద్రాసు కౌన్సిలులో నేడు ప్రశ్నల కాలానంతరం సప్లిమెంటరీ బడ్జెటుపై చర్చ జరిగెను.

శ్రీ జి. సూర్యనారాయణ రావుగారు మాట్లాడుచూ రైతులు సాగుచేస్తూ వారి అధీనములోనున్నట్టి భూములను రాజకీయ బాధితులకు ఒప్పగించడం సరికాదనియు ఆవిధముగ తమకు లభించే భూములను సాగుచేయగల స్థితిలో చాలామంది రాజకీయ బాధితులు లేకుండే దానివల్ల అట్టి భూములందు ఆహారోత్పత్తి క్షీణించునని యూ పలికిరి.

హెన్సమన్ సతిగారు జెయిళ్ళను ప్రభుత్వంవారు నిర్లక్ష్యము చేసినారనియు 50 లక్షలు దీపాలుకోసం ఖర్చించుట ముదావహమనిరి.

అబ్దుల్ లతీఫ్ ఫరూకీగారు ఈ సప్లిమెంటరీ బడ్జెటుకు ఒక సూత్రం ఉన్నట్టుల లేదనిరి. ప్రణాళిక లన్నిటినీ ప్రభుత్వమే మంజూరు చేసిలాంఛనముగ సభవారి అంగీకారమునకు తెచ్చుచున్నట్లు ఉన్నదనిరి. గ్రామాభివృద్ధి స్కీము వృథా ప్రణాళికగా నున్నదనిరి. రెవిన్యూబోర్డు పరావలంబంగా ఉన్నదనీ, ఘోషించి మరో ఆరవ మెంబరును నియమించుట హాస్యాస్పదమనిరి.

డా॥ జాన్ :- ప్రభుత్వంవారికి ఏకేకం హెచ్చు అవుచున్నట్లున్నది?

అధ్యక్షులు :- ప్రభుత్వంవారికి ఉన్నది వ్యక్తిగతముగ జ్ఞానాభివృద్ధి కావచ్చు.

ఆంధ్రులు విడిపోవుచున్నందుకు అభినందించుచూ ఆంధ్రరాష్ట్రం విడిపోవువరకు ఆంధ్రపేపరు మిల్లుకు డబ్బు ఇవ్వకుండా ఆర్థికమంత్రి ఆగి ఉండవలసినదనిరి.

ఆర్థిక మంత్రి గోపాలరెడ్డిగారు : అరవ దేశంలో స్కీములన్నీ మంజూరు చేయవలె. ఆంధ్రదేశానికి ఆంధ్రరాష్ట్రం వచ్చేదాకా ఆగవలె కాబోలు!

ఫరూకీగారు : ఆంధ్రరాష్ట్రం వచ్చువరకూ అనిగాదు. వచ్చే ఏడాది వరకు రాష్ట్రం రాకపోతే అసంగళం కాంతించుగాక.— అటుల ఏర్పాటు చేయవచ్చు. సప్లిమెంటరీ బడ్జెటులో ఇవ్వరాదని ఫరూకీగారనిరి.

గాజుల ఫ్యాక్టరీకి మూడు లక్షలు మంజూరు చేయుటను ప్రశ్నించుచూ ఎవరికి గాజులనిరి. తప్పులుచేసి ధైర్యముగా ఒప్పుకొనలేని మంత్రులకా అని అడిగిరి.

గౌ॥ మాధవమీనన్‌గారు :- ఏమీ లేకుండా గాలి పోగుచేసి మాట్లాడేవారికి.

ఫరూకీగారు మంత్రులకు గాజుల అనుభవం లేదనిరి.

అధ్యక్షులు : గాజుల అనుభవం లేదని మీరు ఎటుల చెప్పగలరు.

ఫరూకీగారు! గాజుల అనుభవం ఉండవచ్చు గాని గాజుల ఫ్యాక్టరీల అనుభవము లేదనిరి. రాజకీయ బాధితులు అన్నపుడు కమ్యూనిస్టు అయినా, సోషలిస్టు అయినా భూములు ఇవ్వవలెను. విద్యుచ్ఛక్తి సప్లయిలలో తాంబరంలో తూర్పు, పశ్చిమ భాగముల ప్రభుత్వోద్యోగులు ఉన్నారని ఇచ్చినారనియు, దగ్గరలో ఉన్న గణపతిపురానికి సప్లయి ఇవ్వలేదనియు ప్రజలు తలచుచున్నారనియు, ప్రజాభిప్రాయము మంత్రులు గమనించవలెననియు తెలిపిరి.

డా॥ తాజుద్దీన్ సాహెబ్‌గారు వ్యవసాయమునకు హెచ్చు ఖర్చు చేయవలెననిరి.

డా॥ జాన్ గారు:-గోపాలరెడ్డిగారు ఆర్థికమంత్రి అయినాక మానుాల బడ్జెటులో ఏమీ తెలపక, పనులు జరిగిపోయినాక సభవారి ఆమోదమునకు సప్లిమెంటరీ బడ్జెటురూపమున తెచ్చుట మామూలైనదనిరి. ప్రభుత్వ ఆర్థికశాఖ పరిస్థితులు దుర్భరమైనవిగా ఉన్నట్టున్నవి. ఇంత అన్యాయమైన శాఖ మరొకటి లేదు. ఆంధ్రదేశంలో అంత పెద్ద తుపాను వచ్చినది. ఈ బడ్జెటులో ఏమైనా ఉపశమనం చేసినారా? ఉటుకున్న మెమెంటలసంలో సెంటిమెంటలు? జమీందార్లకిచ్చిన పరిహారంనుంచి ఏమైనా పనివారికి ఇచ్చుల అమర్చిన చేయుట మంచిదికాదనిరి. ఈ విధంగా ఖర్చులు తెచ్చుట అక్రమము, అశాస్త్రీయమనిరి.

న్యాయమంత్రి :- సప్లిమెంటరీ డిమాండ్లు శాస్త్రీయముగా అయినా అన్యాయమైనవా అని అడుగుచున్నాను.

డా॥ జాన్‌గారు.లాంఛనంగా ఇప్పుడు తొందరలో ఖర్చుకాని 1950 మార్చిలో ఖర్చులు కలిపి పెంచుట అశాస్త్రీయమనిరి. ఇంతఖర్చు అవునని లక్ష్యములేనిచో ఎటుల పనిచేసెదరనిరి. ప్రభుత్వంవారికి అంచనాలులేవు. ప్లానులేవు. సరిగ్గా రెడు హెచ్చుతగ్గుగా లెక్కలువేసెదరు. ఇది యుక్తమా? 1945 కంటె 17 కోట్లు హెచ్చుగా ఇప్పుడు ఖర్చుచేయుచున్నారు.

మంత్రి మాధవమీనన్ :- సప్లిమెంటరీ బడ్జెటులో లేనిదానిపై మాట్లాడుటకునా అన్నదానిపై అధ్యక్షుల నిర్ణయము కోరుచున్నాను.

డా॥ జాన్‌గారు — ఇందులో రాష్ట్రాభ్యుదయమునకు తగిన వేమీ లేవని తాము కూర్పవచ్చునా అనిరి.

అధ్యక్షులు :- గౌరవసభ్యులు సప్లిమెంటరీ బడ్జెటులో లేనిదానిపై మాట్లాడరాదని నిర్ణయమిచ్చిరి.

డా॥ జాన్‌గారు.- తుపాను నిమిత్తం ప్రజాసహాయానికి ప్రభుత్వం సప్లిమెంటరీ బడ్జెటులో ఏర్పాటుచేయక పోయినదో అడగరాదా అనిరి.

బడ్జెటులో లేని తుపానుపరిహారంగూర్చి చాలా చర్చ జరిగినదనియు, ప్రభుత్వం వారికి గౌరవసభ్యుడు వేరే సమయమున సూచించ వచ్చునని అధ్యక్షు లనిరి.

ప్రభుత్వంవారికి తాము సూచనలు చేయుచున్నాము గాని నిరర్థకము లగుచున్నవనియు, గుర్రాన్ని నీటిదగ్గరకు తీసుకుపోవగలము గాని నీటిని త్రాగించలేమనిరి. ఖర్చు తగ్గించుకోవలెననీ, అమ్మకాలపన్ను హెచ్చు చేసినందున ప్రజలు నిత్యావసరముల ధరలు ఆకాశమంతఎత్తున పెరిగిన వనియు, అమ్మకాలపన్ను తగ్గించవలెననిరి. మద్యనిషేధంవచ్చినాక పిల్లలూ తల్లులూకూడా క్రొత్తగా దొంగసారాయి త్రాగుచున్నారని మాజీమద్యనిషేధమంత్రి తెలిపినా రన్న సంగతిని జ్ఞప్తికి తెచ్చుచున్నామనిరి.

అధ్యక్షులు :—మీరు మార్చిలో ఈ వివరములు మాట్లాడవచ్చు.

డా॥ జాన్ :—మార్చిలో ఈ సభ ఉండునో లేదో నాకు తెలియదు. ఆంధ్రరాష్ట్రం అప్పటికి రాగలదు.

డా॥ జాన్‌గారు :—మంత్రులు నిద్రపోకుండా కార్యదక్షులు గావలెననిరి.

### చర్చకు ఆర్థికమంత్రి సమాధానం

ఫలహారానంతరం కౌన్సిలులో తిరిగి సమావేశమైన పుడు సప్లిమెంటరీ బడ్జెటు చర్చకు ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు సమాధానమిచ్చిరి. ప్రతిపక్షనాయకుడు ఆర్థికశాఖపట్ల చేసిన విమర్శకు జవాబు ఇచ్చుచూ విమర్శించునప్పుడు ఆలోచించి చేయవలెను గాని ఏకంగా ప్రభుత్వముదుయ్యబట్టి లాభములేదనిరి. శాసనసభ్యాలు అసలు అనుబంధఖర్చుల స్టేటుమెంటును ఈ సభకు తీసుకొని రావలసిన అగత్యమే లేదు. అయినా సాంప్రదాయమునుబట్టి తీసుకొని రాబడినదనిరి.

శాసనసభ ఆమోదము లేకుండా పెద్ద మొత్తములను ఖర్చుపెట్టుట ఆర్థికశాఖ ఉద్దేశ్యముకాదు. సంవత్సరము ముందుగనే ఆలోచించి అంచనావేయుట కష్టము. కనుక విమర్శించి ప్రయోజనములేదనిరి. మద్యనిషేధము అమలుజరిపినా అనేకరకములగు ప్రజాహిత కార్యములు జరుపుచున్నందుకు ప్రభుత్వమును అభినందించవలసి యున్నదనిరి. పోలీసు, జైళ్ల మీద వ్యయము పెరిగినది. ఆ మాట నిజమే.

వి. కే. జాన్ : జైళ్లలో ఖయిదీలు ఎక్కువ అయినారు గదా.

స : త్రాగుడుకు సంబంధించిన ఖయిదీలు వుండవచ్చును. ప్రత్యేకముగా ప్రశ్న వేసిన సమాధానం ఇచ్చెదను.

ఈ ఖర్చు అవసరమా? అఖర్చు అవసరమా యని శ్రీ సూర్యనారాయణరావుగారనిరి. ఈ విషయములన్నింటినీ ప్రభుత్వము పరిశీలించి సరి మంజూరు చేసినదనిరి.

కాంగ్రెసువారు రెవిన్యూబోర్డును రద్దు చేయుదున్నమాట నిజమేగాని సమగ్ర పరిశీలనానంతరము రెవిన్యూబోర్డును రద్దు చేయుట అంత సులభముగా నిపించినది. అటిగాక ప్రత్యేకమైన పనులు పెరిగినవి. బోర్డు అంటూ లేకపోయినా ఈ పనుల నిర్వహణకు నిపుణులు అవసరమనియు, బోర్డును చేయుట అంత ప్రయాసము గాదనిరి.

ఇంకనూ సభ్యులు ఆక్షేపణాదనలు చేసిరి. ఆ సూచనలు ఆయాపద్దులక్రింద ఖర్చు పెట్టునప్పుడు గమనించెదమని చెప్పిరి.

## మంత్రి మాధవమీనన్ పర్యటన

### తుపాను బాధితులకు ఓదార్పు

మంగళగిరి, నవంబరు 20: న్యాయ విద్యాశాఖల మంత్రి గౌ. కె. మాధవమీనను, వారి సతి పట్టిమాలు అమ్మగార్లు, మద్ది సుదర్శనం, గుంటూరు పురపాలక సంఘాధ్యక్షుడు పుష్పటూరు పున్నారావు, టి. జాలయ్య, జిల్లాకలెక్టరు టి. ప్రభాకరరావునాయుడుగార్లతో నేడు యిచ్చటకు వచ్చిరి. చింతక్రింద కనకయ్య హైస్కూలు కమిటీ తరపున టి. శ్రీకంఠము, సి. హెచ్. కనకయ్యగార్లు మంత్రిగారికి పుష్పమాలలు వేసిరి. హైస్కూలులో సుదర్శనంగారి అధ్యక్షతను సభ జరిగెను. శ్రీకంఠముగారు మంత్రిగారికి స్వాగత పత్రము సమర్పించుచూ, హైస్కూలు భవనమునకు ప్రభుత్వమువారు భవన నిర్మాణ ఫండులో నుంచి ధనసహాయము చేయవలెనని కోరిరి. మంత్రిగారు సమాధానము చెప్పుచు తమ ప్రాంతములో కంటె గుంటూరు జిల్లాలో హైస్కూళ్లు హెచ్చుగా వుండుట చాలా సంతోషము కలిగించెననీ, చాలాచోట్ల ధనవంతులు దాతలు హైస్కూళ్లకు భవనములు కట్టించి యిచ్చి ధనరూపముగా విరాళములు యిచ్చి విద్యావ్యాప్తికి తోడ్పడుచున్నారనీ, అలాగే ఇక్కడివారు ప్రయత్నించవలెననీ నుడివిరి. స్కూలు భవన ప్లానులు విద్యాశాఖ డైరక్టరుగారికి పంపి వారి అనుమతిపొందిన తరువాత భవన నిర్మాణ నిధిలో నుంచి సాధ్యమైనంత హెచ్చు మొత్తమును యిచ్చుటకు ప్రయత్నించుతామనిరి. ఆంధ్రదేశము తుపానువల్ల చాలా నష్టపడినదని చాలా విచారించి కష్టదశలో యున్న ప్రజలను ఆదరించుట మన ఆచారము గాన గుంటూరు వచ్చినామనిరి. తుపానువల్ల చాలా ప్రాథమిక పాఠశాలలు నష్టపడినవి. చాలాచోట్ల నుంచి ధనసహాయము గోరుచూ దరఖాస్తులు విరివిగా వచ్చుచున్నవి. ఆంధ్ర ప్రాంతమునకు ప్రభుత్వమువారు తగు సహాయము చేయుచున్నారు. మీరంతా చాలా ప్రశాంతముగా వున్నందుకు చాలా సంతోషము అనిరి. వారి ఆంగ్ల ఉపన్యాసమును శ్రీకంఠముగారు తెలుగులో తర్జుమాచేసి చెప్పిరి.

పట్టిమాలు అమ్మగారు తెలుగులో మాట్లాడుచు ఆంధ్ర ప్రాంతములో తుపానువల్ల గలిగిన నష్టములు, బాధలు స్వయముగా చూచి బాధితులకు సుఖకరమును గలుగజేయుటకు వచ్చినామనిరి.

అల్పాహార విందు అనంతరము మంత్రిగారు గుంటూరు వెళ్లిరి. (స్వ. వి.)

### తెనాలికి రాక

తెనాలి, నవంబరు 20: ఈరోజు ఉదయం కలకత్తా మెయిలులో గౌ॥ విద్యాశాఖా మాత్యుల శ్రీ కె. మాధవ మీనన్‌గారు వారి సతీమణితో తెనాలికి వచ్చిరి. రైల్వే ప్లాట్‌ఫారం మీద గుంటూరు జిల్లా జడ్జి శ్రీ అబ్దుల్ సత్తార్ శ్రీ చలసాని సత్యనారాయణ (గంజాంపూరు డిస్ట్రిక్టు జడ్జి) తెనాలి సబ్‌జడ్జి వెంకట సుబ్బయ్య గార్లు స్థానిక కాంగ్రెసు నాయకులు మంత్రిగారికి వారి సతీమణికి గొప్ప స్వాగత మొసంగిరి. అల్పాహారానంతరం వారు కారులో గుంటూరుకు వెళ్లిరి.

డిశంబరు 15 వ తేదీలోగా తాలూకా పట్టణ కాంగ్రెసు సభ్యులు తనకు చేరిన సభ్యత్వ ఫారముల రసుములో సహా జిల్లా కాంగ్రెసు కార్యాలయానికి పంపవలెనని గుంటూరు జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ అలపాటి వెంకటరామయ్యగారు తెలియ జేయుచున్నారు.

### తెనాలి పురపాలక సంఘ సమావేశము

నిన్నటి ఉదయం 8 గం॥ లకు తెనాలి పురపాలక సంఘ అత్యవసర సమావేశము ఛైర్మన్ శ్రీ నన్నపనేని వెంకటరావుగారి అధ్యక్షతను జరిగినది. తెనాలి పూరి చెక్కను ఖ్యాడ్పించి చుట్టు భవనములు కట్టించుటకున్నూ, మధ్యలో పార్కు వేయుటకున్నూ, యిందుకుగాను వెంటనే పని ప్రారంభించవలెననీ, ప్రభుత్వం వారిని భవనములు కట్టుటకు అనుమతి యివ్వవలసినదని కోరుటకును, తెనాలి మారీసు పేటలో రణరంగ చౌకులో 1942 ఆగస్టు ఉద్యమంలో బ్రిటిషు ప్రభుత్వం వారి తుపాకి కాల్పులకు గురియై ప్రాణములు కోల్పోయిన ఆగస్టు వీరులకు స్మారక చిహ్నము నిర్మించుటకు గాను 100 గజముల స్థలమును గజ 1 కి రు 3-0-0 ల చొప్పున ఖరీదుకు యివ్వవలెననిదిగా ప్రభుత్వమును కోరుటకును తీర్మానించిరి.

### ఉభయ గోదావరిజిల్లాల్లో రెవిన్యూమంత్రి పర్యటన

చెన్నపట్నం, నవంబరు 21: రెవిన్యూ మంత్రి శ్రీ హెచ్. సీతారామిరెడ్డిగారు ఈ నెల 25 వ తేది రాత్రి 9 గం.లకు కలకత్తా మెయిలులో చెన్నపట్నంనుంచి బయల్దేరి యీ క్రింది కార్యక్రమము ప్రకారం తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల్లో పర్యటించెదరు. నవంబరు 27 ఉ. 8-27 ఏలూరు 9 గం. తంగెళ్లమూడి తమ్మిలేరు ఇన్‌స్పెక్షను, ఉ. 10 నుండి సా. 4 వరకు కొల్లేటి లంకలను చాటప్రరుమీదగా వెళ్లి దర్శింతురు, మునిగిపోయిన లంకల తనిఖీ-ఆకివీడు, సా. 4 నుండి రాత్రి 7 వరకు భీమవరం తాలూకాలో తుపానుదెబ్బ తగిలిన ప్రాంతాల తనిఖీ. రాత్రి 10 నరసాపురంలో మకాం.

నవంబరు 28 ఉ. 8 నుండి 11 గం. వరకు వేములదీవి, మధ్యా. 12 మొగల్తుర్రు, మ. 2 నుండి సా. 6 గం. నరసాపురం తాలూకాలో మాచిపూర్ ఆచంట దొడ్డిపట్ల ప్రాంతాలలో దెబ్బతగిలిన ప్రదేశాల సందర్శనం. రాత్రి నరసాపూర్‌లో మకాం-నవంబరు 29 ఉ. 7 నుండి 12 గం. వరకు రాజోల్ తాలూకాలో తుపానుబాధిత ప్రాంతాల తనిఖీ. మ. 12 నుండి 1-30 గ. వరకు గన్నవరం (టి. బి.) ముంగొండ బేసిక్ ట్రెయినింగ్ స్కూలు సందర్శనము. మ 3 గం. కొత్తపేట ప్రదేశము తనిఖీ. 3 గం. అమలాపురం కోస్తాప్రాంతాల ప్రర్యటనము. సా. 6 గం. కోటిపల్లి. రాత్రి అక్కడే మకాం.

నవంబర్ 30 ఉ. 6 గం. కాకినాడకు ప్రయాణం. తేని. రోడుమీదగల రామచంద్రాపురం కాకినాడ తాలూకాల ప్రదేశముల తనిఖీ. 8 గం. కాకినాడ. ఉ. 9-30 పిఠాపురమునకు ప్రయాణం. 10 గం. పిఠాపురం ఎస్టేటు ఆఫీసు ఇన్‌స్పెక్షన్. 10-30 తుని కి ప్రయాణం పెద్దాపురం పిఠాపురం, తుని తాలూకాల తనిఖీ. మ. 1 గం. తుని ప్రయాణికుల బంగళాలో శాసనసభ్యులు జిల్లా అధికారులతో సమావేశం-మధ్యా. 2-14 గం. తునినుంచి కలకత్తా మెయిలులో పయనమై డిశంబరు 1 వ తేదీ ఉ. 8-10 గం. మదరాసు చేరెదరు.

### పబ్లిక్ వర్కుల్సు మంత్రి పర్యటన

పబ్లిక్‌వర్కుల్సు మంత్రి శ్రీ యం. భక్తవత్సలం గారు డిశం 2 వ తేదీ రాత్రి కలకత్తా మెయిలులో బయల్దేరి యీ కార్యక్రమము ననుసరించి పర్యటన గావించెదరు.

డిశం 3 ఉ. 10-48 గోదావరి 11 గం. ధవళేశ్వరమునకు ప్రయాణం. మ॥ 3 గం. తుపాను నష్టము గూర్చి రివిన్యూ సి. ఎగ్జిక్యూటివ్ ఉద్యోగులు జిల్లా యిరిగేషన్ సమావేశ సభ్యులు శాసన సభ్యులు అధికారులతో చర్చ.రాత్రి 1"-30 రాజమండ్రి నుంచి పయనమై రాత్రి 11-55గం. నిడదవోలు చేరెదరు. సెట్టిపేట బంగళాలో మకాం.

డిశం 4 ఉదయం తుపానుచే నష్టపడిన ప్రాంతాలతనిఖీ. సా 4 గం. ఆఫీసర్లు శాసన సభ్యులు అధికారులతో నిడదవోలులో చర్చ.

డిశం 5 ఉ 5-47 గం నిడదవోలు నుండి పయనం. 9-0 8 గం. నూజివీడు 9-15 మోటారులో విజయవాడ రస్తా మీదుగా బయలుదేరి తనిఖీ. సా 3 గం. అధికార అనధికారులతో సంప్రదింపులు. రాత్రి 10 గం.లకు విజయవాడ నుండి బయల్దేరి 6 వ తేది ఉద. 8-10 గం. చెన్నపురి చేరెదరు.

### ఉద్యోగ వార్తలు

చెన్నపట్నం, నవంబర్ 21: శ్రీ కె. ద్రవ్యంగారు ప్రభుత్వ ప్రచార శాఖ అసిస్టెంటు డైరెక్టరు తాత్కాలికముగా డిప్యూటీ డైరెక్టరుగా నియమింపబడిరి

## విజయవాడలో నాటక కళోత్సవాలు

### జనవరి మూడవ వారంలో

విజయవాడ, నవంబరు 20: మొన్న సాయంకాలం 6 గంటలకు పెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయంలో స్థానిక నాటక సమాజ సభ్యుల సమావేశం జరిగెను. పి. వి. ఆచార్యగారు అధ్యక్షతవహించిరి. 1950 సం॥ జనవరి మూడో వారంలో, విజయవాడలో నాటక కళామహోత్సవాలను వారం రోజులు జరుపుటకు నిర్ణయించుటమైనది. ఈ నగరంలో ప్రస్తుతం 14 సమాజములు పనిచేస్తూ ఉన్నవి. మొత్తం ఈ ఉత్సవాలలో 8 నాటకాలు, 6 లేక 6 నాటికలు ప్రదర్శింపబడును. ఇదిగాక భరతనాట్య ప్రదర్శనములు మొదలైన కార్యక్రమము లుండును. నాటక కళకు సంబంధించిన వ్యాసములతోను, మహోత్సవాల కార్యక్రమమును వివరిస్తూ సుమారు 60 పేజీలుగల సంచికను ప్రకటించడానికి గూడ నిర్ణయించుట మయినది. డా॥ పి. వి. ఆచార్యగారు అధ్యక్షులుగను, వేమూరి ఆంజనేయశర్మగారు కార్యదర్శిగనుస్థానిక సమాజప్రతినిధులతో కార్యవర్గంఏర్పాటు చెయ్యుట మైనది. ఈ ఉత్సవములకు వచ్చే రాబడిని, ఆంధ్రనాటకకళా పరిషత్తువారు విజయవాడలో నిర్మించదలచు కొన్న రాఘవకళా కేంద్రమునకు ఇచ్చుటకు తీర్మానించారు.

## ప. గో. జిల్లా కాంగ్రెస్ కార్యకర్తలపై క్రమశిక్షణ చర్య

### రాష్ట్రపతి ఉత్తరువు

(స్వకీయ విలేఖరి)

విజయవాడ,నవంబరు21 : పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు అల్లూరి సత్యనారాయణరాజు (ఎం. ఎల్. ఏ), ఎం. బాపినీడు (ఎం. ఎల్. ఏ),గారలతో సహా 9 మంది ఆజిల్లా కాంగ్రెస్ కార్యకర్తలపై రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షుడు యిటీవల తీసుకొన్న శిక్షణ చర్య అమలును, నిలుపుదలచేస్తూ, రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు పంపిన ఉత్తరువు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి నేడు చేరింది.

గత నెల 24 వ జరిగిన పశ్చిమగోదావరి జిల్లాబోర్డు అధ్యక్ష ఎన్నికలో మైనార్టీ అధికార కాంగ్రెసు అభ్యర్థికి పోటీగా మరొక కాంగ్రెస్ అభ్యర్థిని నిలిపి, అధికార అభ్యర్థికి ఓటమి కలిగించి, రాష్ట్ర కాంగ్రెసు ఆదేశాలను ధిక్కరించినారని రాష్ట్రసంఘ అధ్యక్షులు వారిని రెండు నెలలవరకు సస్పెండు చేస్తూ యీ నెల మొదటి వారంలో ఉత్తరువు చేసియున్నారు.

రాష్ట్రసంఘ అధ్యక్షుని చర్య ఆమోదిస్తూ, రాష్ట్రకాంగ్రెస్ సంఘం నవంబరు 11 న సమావేశమైనప్పుడు తీర్మానం చేసియున్నది.

జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుని, కార్యవర్గ సభ్యులలో ఎక్కువమందిని సస్పెండు చెయ్యవలసినంత అవసర పరిస్థితి ఏర్పడలేదనీ, ముందు వారిపై విచారణ జరిపి తర్వాత చర్యతీసుకోవాలనీ రాష్ట్రపతి తమ ఉత్తర్వులో తెలియజేసినట్లు తెలుస్తున్నది. ఈవిధంగా శిక్షణచర్య తీసుకొన్నచో జిల్లాలో కాంగ్రెస్ కార్యక్రమానికి అవరోధం ఏర్పడగలదనికూడ రాష్ట్రపతి తెలియజేసినట్లు తెలుస్తున్నది.

రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గం వారు యిటీవల సమావేశమైనప్పుడు యీ విషయాన్ని గురించి విచారణజరిపి, డిసెంబరు 15లో రిపోర్టు పంపుటకు వై. సుబ్రహ్మణ్యం ఎ. రామనాథం వి. వి. రమణ గారలతో ఒక సంఘాన్ని నియమించారు.

## ప్రొద్దుటూరులో విద్యుచ్ఛక్తి సరఫరా

### "ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి"

ప్రొద్దుటూరు, నవంబరు 20: స్థానిక ఎం. ఎల్. ఎ. కె. బాలనారాయణరెడ్డిగారు శాసనసభకు హాజరై మద్రాసు నుంచి యీవేళ తిరిగివచ్చిరి. ఈవూరిలో విద్యుచ్ఛక్తి సరఫరాను ప్రభుత్వం స్వాధీనము చేసుకొనే విషయమై యేమి జరిగిందని ప్రశ్నించగా తను యేర్పాట్లు జరుగుచున్నవని వారనిరి.

ఈ విషయమై మొన్న 14 వ తేదీని బాలనారాయణరెడ్డి, జి. మధ్వమునిరావు, సి. హెచ్. పద్మనాభశాస్త్రిగార్లు మంత్రియొద్దకు రాయబారంవెళ్ళి ప్రొద్దుటూరు ప్రజలుపడే యిబ్బందులు నివేదించి,ప్రభుత్వంయీవూరి ఎలెక్ట్రిక్ కంపెనీని స్వాధీనము చేసుకోవాలని ఒత్తిడిచేసి చెప్పిరి. మంత్రి సంజీవిరెడ్డిగారు రాయలసీమ ఎకనామిక్ బోర్డు అధ్యక్షుడు విద్యుచ్ఛక్తి జాతీయంచేసేబిల్లు శాసనసభలో మంజూరు చేయగానే తగుచర్య తీసికొంటామనిరి.

ఈ సందర్భములో స్థానిక మునిసిపల్ కౌన్సిలు తరఫున పాణ్యం ఎర్రమునిరెడ్డి (ఛైర్మను), కొప్పరపు సుబ్బారావు, బుసెట్టి చిన్నసుబ్బరాయుడుగార్లు పబ్లికు వర్కుల్సుమంత్రి భక్తవత్సలంగారి యొద్దకు రాయబారం వెళ్ళుచున్నారు. ఈవూరులో పదిమాసములనుంచి విద్యుచ్ఛక్తి సరఫరాలేదు.

### మహిళాసమాజం సమావేశం

స్థానిక మహిళల బహిరంగసభ ఒకటి నిన్న జరిగెను. కె. మాలతిబాయి, కె. జె. కమలాబాయిగార్లు మహిళా సమాజం కార్మికులలో చేసినసేవ వివరించి కార్మికులలోయుండే యువకులకు ఉన్నదుస్తులు కాచేనిమిత్తం విరాళములు విరివిగా యివ్వమని కోరిరి. (స్వ. వి.)

### బి. ఏ. వరకు హిందీభాషలో పరీక్షలు

పాట్నా, నవంబరు 20: హిందీ భారతదేశ రాజభాషగానుండునని భారత రాజ్యాంగ పరిషత్తువారు నిర్ణయించుటచేత విద్యార్థులు బి. ఏ. వరకు హిందీభాషలో పరీక్షలివ్వ వీలుకల్పించుటకు పాట్నావిశ్వవిద్యాలయాధికారులు సంకల్పించుచున్నారని పాట్నా విశ్వవిద్యాలయోపాధ్యక్షుడు శ్రీ సచ్చిదానందసిన్హాగారు నేడు ప్రకటించిరి.

## దేశాభివృద్ధి ఒక్కటే విశ్వవిద్యాలయాల లక్ష్యం

### రాజపుటానా విశ్వకళా పరిషత్ స్నాతకోత్సవ సభలో సి. వి. రామన్ ప్రసంగం

జయపూర్, నవంబర్ 18:— ఈవేళ ఇక్కడ జరిగిన రాజపుటానా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సభలో మాట్లాడుతూ సర్. సి. వి. రామన్ ఇలాగ అన్నారు.

"మాతృదేశ వైభవం పెంపొందించడము, తోడి సోదరమానవులకు సేవచెయ్యడము, మన విశ్వవిద్యాలయాలకు పరమాదర్శాలుగా ఉండాలి. మన విద్యార్థులు మహోన్నతమైన మన పూర్వ తన చరిత్ర అర్థం చేసుకోవాలి. ఆ చరిత్రకు అనుగుణంగా తమ నడవడికనుమలుచుకొని, మనదేశ మహోన్నత్యం సాధించాలి. మన విశ్వవిద్యాలయాలు విద్యార్థులను ఈ విధమైన వారినిగా తయారు చెయ్యాలి."

చాన్సలరు ఉదయపూరు మహారాజా రాకపోవడంవల్ల వైసుఛాన్సలరు డాక్టరు జి. యస్. మహాజని స్నాతకోత్సవానికి అధ్యక్షత వహించారు.

రాజస్థాన రాజప్రముఖులు జయపూర్ మహారాజా, రాజస్థాన ప్రధాన మంత్రి హీరాలాల్‌శాస్త్రి ప్రముఖులు ఈ సభకు హాజరైనారు.

అలహాబాద్, తూర్పుపంజాబ్, నాగపూర్, పూనా విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులు మరికొందరు ప్రముఖులు ఈ స్నాతకోత్సవానికి శుభాశీస్సులు పంపించారు.

డాక్టరు రామను తమ స్నాతకోపన్యాసంలో ఇంకా ఇలాగ చెప్పారు. "మనం అందరము భారతదేశం ఒక గొప్పదేశం కావాలని వాంఛిస్తున్నాము. అయితే దానికి దేశంలోఉన్న మేధాసంపత్తినంతటినీ మనంసరిగా వినియోగించుకోవాలి. మనకు స్వాతంత్ర్యం అయితే వచ్చింది. కాని మనం ఇంకా హాత్రిళ్లలో సేఉన్నాము. మనం మన సంపత్తిని సరియైన మార్గాల్లో వినియోగించుకోవాలి.

అమెరికా నూరేండ్లకు పూర్వం ఏస్థితిలో ఉన్నదో ఇప్పుడుమనం అస్థితిలోనే ఉన్నాము. విద్యాసంస్థలను వృద్ధిచెయ్యడంవల్లను భారతం మహోన్నతస్థితికి పొందగలదు. ఒకదేశం సంపత్తు, ఆదేశయువకుల హృదయాలలోను, మేధలలోను, శక్తిలలోను ఉంటుందిగాని, వెండిబంగారాలలో ఉండదు. మనం ఈ యువకుల సంపత్తిని జాగ్రత్తగా పెంపొందించుకోవాలి. విశ్వవిద్యాలయాలు ఈ సంపత్తిని పెంపొందించాలి. క్రొత్తతరం వారిని దృఢతరంగా చెయ్యడంవల్లనే ఒకదేశభవిష్యత్తు వృద్ధి చెందుతుంది."

అంతర్జాతీయ బాంకునుండి 10 కోట్ల డాలర్లు అప్పుతీసుకోవడంవల్లగాని, పెద్ద పెద్ద డాములు నిర్మించడంవల్లగాని, మనదేశం గొప్పది కాజాలదు. తరువాత మన విద్యార్థులకు విదేశాలలో చెప్పించడంవల్లగాని ఎవరో కొంతమంది విదేశ నిపుణులను ఇక్కడకు రప్పించడంవల్లగాని అంతగా ప్రయోజనం ఏమీలేదు. మనం ఒకరిమీద ఆధారపడడం మానివేసి స్వయంసహాయం వృద్ధిపొందించుకోవాలి. మన కున్న పరిస్థితులలోనే మనం మన సమస్య సాధించుకోవాలి.

పాశ్చాత్యులు నూరేళ్ళపాటు పరిపాలించి, మనలను సాంస్కృతికంగాను, ఆధ్యాత్మికంగాను జయించారు. సాంస్కృతికంగా మనకింకా స్వరాజ్యం రావలసే ఉన్నది. మనకీ విషయంలో స్వరాజ్యం వస్తే ఆర్థికాది విషయాలగ్గ స్వరాజ్యం దాని అంతట అదేవస్తుంది.

శాస్త్రీయ విషయంలో కూడా మనం చేయగలిగినదంతా చెయ్యాలి. మన కనేకమైన విశ్వవిద్యాలయాలున్నాయి. వేలకొలది పట్టభద్రులున్నారు. వీరిలో ఏ కొంతమందైనా తమకర్తవ్యం నిర్వర్తిస్తే దేశం తప్పక అభివృద్ధి చెందుతుంది.

అమెరికావారు 50 ఏళ్లక్రితం తమ యువకులను విదేశాలకు పంపించి జ్ఞానార్జన చేయించారు. అయితే అమెరికా ఈవేళ శాస్త్రంలోను, జ్ఞానంలోను ప్రపంచంలో అగ్రస్థానం వహించింది.

ఈ విధమైన జ్ఞానాభివృద్ధి జరగాలంటే ఈ దేశంలో అపారంగా ధనం గడించిన వారు దేశంలో వందలాది విజ్ఞాన కేంద్రాలు నెలకొల్పాలి.

అమెరికా విశ్వవిద్యాలయాలవల్లనే అమెరికాలో బాగా పారిశ్రామికాభివృద్ధి జరిగింది.

ఈ విషయం అందరు గుర్తించి దేశయజ్ఞానాభివృద్ధికి తోడ్పడాలి."

## దక్షిణఇటలీలో కర్షకుల తిరుగుబాటు

### బలాత్కారంగా వేలాది ఎకరాల భూమి ఆక్రమణ

రోం, నవంబర్ 21: ఇటాలియన్ పోర్టులాండ్‌లో పోలీసులకు, కర్షకులకు తీవ్ర సంఘర్షణలు చెలరేగుచున్నట్లు నేటి రాత్రి దక్షిణఇటలీనుండి వార్తలు వచ్చినవి. రెండురోజులపాటు పర్యటించుటకు ఇటలీ ప్రధాని ఆల్సిడిగాస్పెరి అక్కడికి వచ్చిన కొలదిగంటలకే యీ సంఘర్షణలు ప్రారంభమైనయి.

దక్షిణఇటలీ, సిసిలీలలో 400 మైళ్ళ పర్యంతం కర్షకులు వేలకొలది ఎకరాల భూమిని, బలాత్కారంగ ఆక్రమించుకొని స్వయంగా దున్నడం ప్రారంభించడంమూలంగా యీ సంఘర్షణలు ప్రారంభమైనట్లు తెలుస్తున్నది.

ఈ కర్షకుల తిరుగుబాటును అణచుటకు, బలప్రయోగం చేయవలసిందిగా పోలీసులకు, ఇటలీ హోంమంత్రి యివ్వార ఉత్తర్వు లిచ్చాడు.

భూస్వాములనుండి తీసుకొన్న 9 వేల ఎకరాలభూమిని, రైతులకు త్వరగా పంచి యివ్వవలసిందిగా ఉద్యోగులకు ఉత్తర్వు చేస్తున్నానని ఇటలీప్రధాని రైతులకు హామీ యిచ్చాడు.

గతవారం కమ్యూనిస్టు కార్మిక ఫెడరేషన్ ప్రభుత్వంతో చేసుకొన్న ఒడంబడికను ధృవీకరించారని ఈ ఒడంబడిక షరతుల ప్రకారం, 9 వేల ఎకరాల భూమి పంపిణీ వివరాలు తేలేవరకూ కర్షకాందోళనను నిలిపివేస్తామని కార్మిక ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి ఒప్పుకొన్నాడని, ఇటలీ ప్రభుత్వోద్యోగులు అన్నారు.

## ఆగ్నేయాసియాకు ఆర్థిక వైద్య సహాయం

### ఆస్ట్రేలియా పత్రికలో సూచన

మెల్‌బోర్న్, నవంబరు 20: కమ్యూనిజం వ్యాప్తిని అరికట్టేందుకుఆస్ట్రేలియా మొదలైన కామన్‌వెల్తు దేశాలు, ఆసియా రాజ్యాలకు ఆర్థికంగాను, వైద్య విషయకంగాను సహాయం చేయనున్నట్లు మెల్బోర్న్ ఆర్గస్ పత్రికా రిపోర్టు విలేఖరి వ్రాశాడు. జనవరిలో సిలోన్‌లో జరుగనున్న కామన్‌వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశం పూర్తి అయిన తరువాత ఈ సహాయం ఎట్లా జరిగేది ప్రకటిస్తారట.

ఇటువంటి సహాయాన్ని ముఖ్యంగా ఇండోనీషియా,మలయా, బర్మా, సయాం వంటి దేశాలు పొందుతాయని గూడా అనుకుంటున్నారని ఆ విలేఖరి వ్రాస్తున్నాడు.

## రణదివేకు హావెట్సీటుంగ్ లేఖ

లండన్, నవంబరు 21: ఈసున్నగల కమ్యూనిస్టు చైనా నాయకుడు మోసేటుంగ్ భారత కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శికి ఒక తంతివార్త పంపిస్తూ ఇలాగ అన్నారు. "ఇండియా ఇప్పటికే కాలం సామ్రాజ్యవాదుల వారి అనుచరుల అడుగు మడుగు లొగ్గదు. ఇండియా త్వరలోనే సామ్యవాదకుటుంబంలో ఒకభాగస్వామి కాగలదని నా నమ్మిక."

పైవాలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని అభినందిస్తూ బి. టి. రణదివే ఒక తంతి గూర్తి పంపారట. వానికి సమాధానంగా మోసేటుంగ్ ఈ సందేశం పంపించారని కమ్యూనిస్టు చైనావార్త సంస్థ చెబుతున్నది. మోసేటుంగ్ ఇండియా సోషలిస్టు/ రిపబ్లికన్ పార్టీ అధ్యక్షుడు శరచ్చంద్రబోసుకుకూడా ఒక అభినందనం పంపించారని తెలుస్తున్నది.

## కమ్యూనిస్టులపై మధుర పోలీసులదాడి

### ఇద్దరిమరణం; 5 గురి నిర్బంధం

మధుర, నవంబరు 20: నిన్న రాత్రి మధురలో పోలీసులు కుప కలుకొల్పకు ల బద్దనుండించారు. కొద్దు కమ్యూనిస్టులని అంటున్నారు. నగలదుకాణం మీద జరిగిన దాడిసందర్భంలో నిన్న పోలీసులు ఒకయింటిని చుట్టుముట్టారు.

ఆ యింటిలోనుంచి కొందరు పోలీసులపై బాంబులు విసిరారు. వెంటనేపోలీసులు తుపాకులుకాల్చడంచేత ఈ యిద్దరు మరణించారు.

తరువాత పోలీసులు నాటుబాంబులు దగ్గరవున్నాయనే కారణంచేత అయిదుగురిని నిర్బంధించారు.

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర శు॥ చవితి

1949 సం॥ నవం॥ 23 బుధవారం

బు॥ చవితి రా 2-48పూ॥షా రా 3-45వర్జ్యం ప 1-56 ల 3-28 కు.

శు॥ పంచమి నవం॥ 24 గురువారం

స॥ పంచమి ఘ॥2-0 ఉ॥షా రా 3-38వర్జ్యం ప11-43 ల 1-18 కు.


# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర శు॥ చవితి

బుధవారం


## ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్యలు

కాంగ్రెస్ కార్యవర్గ సిఫార్సుల ననుసరించి కేంద్ర ప్రభుత్వము ఈనెల 26 వ తేదీ లోపుగనే ఆంధ్ర రాష్ట్రమును ఏర్పాటు చేయుచు ఉత్తరువులు చేయగలదను విషయమున ఎట్టి సందేహము లేదు. ఆంధ్రరాష్ట్రనిర్మాణము తక్షణము జరుగవలెనని ఈ సమయమున ప్రధానమంత్రి, ఉపప్రధానమంత్రులవద్దకు తమిళ ప్రముఖులు కొందరు రాయబారము వెళ్ళుట అనవసర మనిపించును. ఆంధ్రరాష్ట్ర తక్షణ నిర్మాణము విషయమున తమిళ ప్రముఖులు ప్రదర్శించుచున్న ఆత్రము, ఆంధ్రులకేగాక, తమిళేతరు లందరికి కొంత విపరీతముగ తోచును. లోగడ మేము స్పష్టము చేసినట్లు తమిళుల ఆత్రమునకు వారికి ఆంధ్రులయెడ గల సానుభూతి, అభిమానములు గాక, చెన్నపట్న భవిష్యత్తు విషయములో వారికిగల అనుమానము, భీతి కారణమని ఇపుడు మరింత స్పష్టమగుచున్నది. తమిళనాయకులు కేవలము ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయమై మాత్రమే పండిట్ నెహ్రూ, సర్దార్ వల్లభాయ్ పటేల్ గార్లతో చర్చించిరని భావించుటకు వీలు లేదు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము కోరిన ప్రకారము, నగరములోని అధిక సంఖ్యాకులు కోరునట్లు, చెన్నపట్టణమును ప్రత్యేకరాష్ట్రముగ చేయరాదని, చెన్నపట్నము ఆంధ్రరాష్ట్రమునకు తాత్కాలిక రాజధానిగ కూడ నుండరాదని, ఆంధ్రప్రభుత్వ కేంద్రము ప్రస్తుతమునకు చెన్నపట్టణమున నున్నను నగరముపై పూర్తి అధికారము, ఆంధ్ర కాంగ్రెసుసంఘము సూచించినట్లు గాక, పూర్తిగ "మద్రాసు ప్రభుత్వమునకే ఉండవలెనని డా॥ సుబ్బరాయన్, టి. టి. కృష్ణమాచారి ప్రభృతులు ప్రధానమంత్రి, ఉపప్రధానమంత్రులకు విన్నవించి యుందురనుట నిస్సందేహము. ఇట్టి విజ్ఞాపనము చేయవలసియుండుట చేతనే తమిళప్రముఖులు ఇపుడు రాయబారము వెళ్లిరి.

కేంద్రప్రభుత్వము ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సంబంధించి నిర్ణయము చేయునపుడు అనేక విషయములను ప్రత్యేక శ్రద్ధతో విచారింపవలసియుండును. అందు ముఖ్యమైనది రాజధాని. ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ఉత్తరువు జారీ అయిన ఉత్తరక్షణమున ఆంధ్ర ప్రభుత్వమునకు కార్యాలయములు, శాసనసభకు భవనములు సర్వసజ్జాలవు. ప్రస్తుత పరిస్థితులలో ఏదోవిధముగ సరిపెట్టుకొనుటకు వీలైన రాజధాని నిర్మాణమైనను పూర్తియగుటకు అధమము మూడుసంవత్సరముల వ్యవధి కావలసి యుండును. ఆంధ్ర ప్రభుత్వమేర్పడగనే, అట్టి ప్రభుత్వము చెన్నపట్టణమును వదలిపోవలసిన అవసరము, అగత్యములేదు. ఆంధ్ర ప్రభుత్వ కేంద్రస్థానము నిర్ధారణమై భవనముల నిర్మాణము పూర్తియగువరకు ఆంధ్ర ప్రభుత్వము నగరమునందుండుటవలన ఎవరికి, ఎట్టి నష్టములేదు. నగర భవిష్యత్తు నిర్ధారణ యగువరకు ఆంధ్ర రాజధాని చెన్నగరమున నుండుటకు ఎట్టి ప్రతిబంధకము లునులేవు. కనుక కేంద్ర ప్రభుత్వము ఆంధ్ర ప్రభుత్వస్థానము విషయమున ఈ విషయముల నన్నిటిని స్పష్టముచేయుచు రాష్ట్ర నిర్మాణ ఉత్తరువులను చేయవలసి యుండును.

ఆంధ్రజిల్లాలు విడిపోయిన అనంతరమున్న చెన్నరాజధాని తిరిగి తమిళ, కేరళ, కర్నాటక ప్రాంతములుగ విభాగమై చెన్నపట్టణ భవిష్యత్తు నిర్ధారణ యగువరకు కూడ ఆంధ్ర ప్రభుత్వ కేంద్రము నగరమునని యుండుట సమంజసము, అవసరముకూడ. అందుకు కేంద్ర ప్రభుత్వము అవసరమైన ఏర్పాట్లు చేయవలెను. ఒకరి యభ్యంతరములు ఇందుకు ప్రతిబంధకము కానేరవు.

ఇక విభజన విషయమున అన్ని భాషా ప్రాంతములకు న్యాయము జరుగవలసి యున్నది. ఆస్తి, అప్పుల పంపకములో కేవలము జనాభానే గాక, ఆయా ప్రాంతముల విస్తీర్ణమును కూడ గమనింపవలసి యుండును. చెన్నగరము సంపలి ఉమ్మడి ఆస్తుల పంపకము పట్టణభవిష్యత్తు నిర్ధారణయగువరకు పరిష్కారము గాదు. నగరము ప్రత్యేకరాష్ట్రమైన ఈ సమస్యయే ఉత్పన్నము గాకపోవచ్చును. కాని సరిహద్దు నిర్ణాయకసంఘ తీర్పునుబట్టిగాక, కేవలము ప్రభుత్వ ఉత్తరువుల ననుసరించి నగరము ఒక భాషా ప్రాంతములో చేరుట జరిగిన, అట్టి భాషాప్రాంత ప్రభుత్వము, ఇతర ప్రభుత్వములకు పరిహారము చెల్లించుట తప్పనిసరియగును. న్యాయ కత్రయసంఘము, ఆ సంఘ నివేదికను ఆమోదించిన కేంద్రప్రభుత్వము చెన్నగరముపై ఆంధ్రులకు హక్కుగలదని యంగీకరించి యుండుటవలన, ఆంధ్రులు అట్టి హక్కులను వదులుకొనినందుకు పరిహారమును పొందవలసియుండు ననికూడ అంగీకరింపకతప్పదు. ఈ వివరములన్నియు సావధానముగ, ఉద్రేకములకుగాని, ఉత్సాహములకుగాని తావివ్వక, నిర్ణయము కావలసియున్నది. ఇది ఒక క్షణములో జరుగునది కాదు. అప్లై రికార్డుల జాబితా తయారు, వాటి పంపకము, అధికారులజాబితాలు, వాటినిబట్టి ఆంధ్రరాష్ట్ర పరిపాలనా యంత్రనిర్మాణము, ఇవి యన్నియు నిర్ణయమగుటకు వ్యవధి కావలసి యుండును.

విభజన సమస్యలిట్లుండ నూతన ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము తుపాను, వరదలవల్ల ఏర్పడిన అసాధారణ పరిస్థితులను ఎదుర్కొనవలసి యుండును. ఆంధ్రరాష్ట్ర ఆదాయములో పెద్ద భాగముగ నున్న భూమి సన్నులో చాల భాగము ఈ సంవత్సరము రెమిషను ఇచ్చుట వలన తగ్గిపోగలదు. ఆంధ్ర ప్రాంతము నిర్మాణము కావలసి యున్న ప్రాజెక్టులన్నియు ఇప్పటికి అంచనాల దశలోనే యున్నవి. వీటిని ప్రారంభించి, పూర్తి చేయవలసి యున్నది. పారిశ్రామికముగ, రాష్ట్రము చాలవెనుకబడి యున్నది. ప్రభుత్వము ఎక్కువగ సహాయము చేసినగాని పరిశ్రమలు అభివృద్ధి కాజాలవు. ఆంధ్రదేశమున పెట్టుబడిదారులు బహు తక్కువ గనుక ప్రభుత్వముఋణములు చేయదలచినను ధనములభింపదు. ప్రజల జీవనప్రమాణమును వృద్ధిచేయుటకు ఆవశ్యకమైన పథకములను అమలుజరుపుటకు ఇంత విపరీతముగ ధనాభావము వుండగా, నూతన రాజధాని నిర్మాణమునకు ప్రభుత్వము ధనమును ఆర్జింపకలుగుట పది సంవత్సరములవరకు సాధ్యముకాదు.

ఇక పాలిపాలనా యంత్రనిర్మాణము విషయమున ఆంధ్ర నాయకులు ప్రత్యేక శ్రద్ధ వహింపవలసి యుండును. ఈ సమస్యలన్నియు తృప్తికరముగ పరిష్కారమైనగాని ఆంధ్రరాష్ట్ర మేర్పడియు ప్రయోజనములేదు. ఈసమస్యలన్నియు రాష్ట్ర నిర్మాణము జరిగి ప్రత్యేక ప్రభుత్వ పరిపాలన ప్రారంభమగుటకు పూర్వమే పరిష్కారమైనగాని, నూతన ఆంధ్రరాష్ట్రము స్థిరపడి అభివృద్ధి చెందజాలదు. తొందర పాటువలన, సరియైన పునాదు లేర్పడక ప్రత్యేకాంధ్రరాష్ట్రము ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి సాధనగ గాక, ప్రతిబంధకముగ పరిణమింపగలదు.

## చైనా-వీట్నాం సరిహద్దులలో ఫ్రెంచి సన్నాహాలు

ముంకే (ఇండొచైనా) నవంబర్ 21: కమ్యూనిస్టుల బారినుండి తప్పించుకుని పారిపోతున్న కొమింటాంగ్ సైనికులు విశేషంగా చైనా-వీట్నాం సరిహద్దులను దాటి వీట్నాంలోకి వచ్చే అవకాశాలు ఎక్కువయినవి కనుక ఫ్రెంచివారు అక్కడ తగినసన్నాహాలు చేస్తున్నారు. ఈ వేళ ఒక కొమింటాంగ్ సేనాని 15 మంది సైనికులతో పారిపోయిరాగా ఫ్రెంచి అధికారులు వారిని నిరాయుధులుగాచేసి నిర్బంధంలో ఉంచారు. తరవాత వీళ్లు అంతర్జాతీయ నియమాల ననుసరించి కొమింటాంగ్ స్వాధీనంలో ఉన్న ప్రాంతాలకు పంపబడతారు.

క్వాంటంగ్‌లో 125 వేలమంది కొమింటాంగ్ సైనికులు కమ్యూనిస్టుల చేతిలో పడబోతున్నారనీ, వీరు సరిహద్దులుదాటి వీట్నాంలోకి పారిపోయిరావటం సంభవమేననీ భావించబడుతున్నది.

ఇండొచైనాలో ఫ్రెంచి హైకమిషనర్ పిగ్నాన్ నేడొక ప్రకటన చేస్తూ సరిహద్దులు దాటివచ్చే చైనీస్ సైనికులం దరూ నిరాయుధులు చేయబడి నిర్బంధించబడతారనీ, వీట్నాం, చైనీస కమ్యూనిస్టులను సమిష్టిగా ప్రతిఘటిద్దామని కొమింటాంగ్ సేనాని పాయ్‌చంగ్ షీ బావ్ దాయ్‌కి ప్రతిపాదించాడన్న వార్త నిరాధారమైనదనీ ప్రకటించాడు. చైనా కమ్యూనిస్టు సేనలు సరిహద్దు దాటి వస్తవనటానికి తగుఆధారమేమీ కనిపించటం లేదని ఆయన అన్నాడు.

**దూర ప్రాచ్య ఫ్రెంచి సేనానిరాక**

దూరప్రాచ్యంలో ఫ్రెంచి సర్వసేనాని జనరల్ కార్పెంటర్ 18 వ తేదీన హక్కాడువచ్చి ముఖ్య సైనికాధికారులతో సంప్రదింపులు జరిపాడు. ఈ సంగానికి అదనపుసేనలు, నౌకలు, ఆయుధాలు పంపబడిరవని అఫీషియల్‌గాలు సల్లడిస్తున్నారు.

## కామన్వెల్త్ వాణిజ్య సమావేశానికి అట్లీ విముఖత

లండన్, నవంబర్ 21: బ్రిటిష సామ్రాజ్య దేశాలన్నిటితోను వాణిజ్య సమావేశం ఒకటి జరపవలసి నేను కామన్స్‌లో కన్సర్వేటివ్ సభ్యుడు హడ్సన్ చేసిన సూచనను ప్రధాని అట్లీ నిరాకరించాడు. ఈ విషయమై ప్రత్యేకించి సమావేశం జరపవలసిన అగత్యం లేదనీ, జనవరిలో కొలంబోలో జరగబోతున్న కామన్వెల్త్ సమావేశంలో దానిని చర్చించుకునే అవకాశం ఉన్నదని అట్లీ జవాబిచ్చాడు.

# లిబియాకు స్వాతంత్ర్యం

## ఇటలీ వలసలపై ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశ నిర్ణయం

### రాజకీయసంఘ తీర్మానామోదం

ఫ్లషింగ్ మెడోస్, నవంబరు 21: ఇటలీవలస రాజ్యాల గురించి రాజకీయసంఘం చేసిన తీర్మానమును ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ ఈవేళ ఆమోదించింది. ఉత్తర ఆఫ్రికా భూభాగమైన లిబియాను స్వతంత్ర రాజ్యంగా ఏర్పాటు చేయాలనీ, సోమలీలాండ్‌మీద ఇటలీకి 10 ఏళ్ళపాటు ధర్మకర్తృత్వాధికారం ఇవ్వాలనీ, ఎరిట్రియా భవిష్యత్తు విషయమై సిఫార్సులు చేయడానికి ఒకవిచారణసంఘాన్ని నియమించవలెననీ, ఐక్యరాజ్యసమితి తీర్మానించింది.

లిబియాలో స్వతంత్ర ప్రభుత్వమును స్థాపించి నూతన రాజ్యాంగమును తయారు చేయడంలో తోడ్పడడానికి ఒక కమీషనర్‌ను నియమించవలెననికూడా అసెంబ్లీ నిర్ణయించింది. ఈ కమీషనర్‌కు 10 మంది సభ్యులతో కూడిన ఒక సలహా సంఘం చేదోడుగా ఉంటుంది.

సలహా సంఘంలో సభ్యులుగా ఉండేవారు వీరు:—ఈజిప్టు, ఫ్రాన్సు, ఇటలీ, పాకిస్తాన్, బ్రిటన్, అమెరికా, దేశాల ప్రతినిధులు; సైరెనైకా, ట్రిపోలిటానియా, ఫెజ్జాన్ల ప్రతినిధులు; లిబియాలోని అల్ప సంఖ్యాకవర్గాల ప్రతినిధి సభ్యులు జనరల్ అసెంబ్లీ చేసే నిర్ణయాలను విధిగా పాటించవలెనన్న నిర్బంధ మేమీ లేదు; కాని సాధారణంగా అసెంబ్లీ నిర్ణయాలను పాటించనం ఒక విధమైన నైతిక బాధ్యతగా పరిగణింపబడుతూ వస్తోంది. అయితే ఇటలీ వలస రాజ్యాల విషయంలో అసెంబ్లీ నిర్ణయాలను శిరోధార్యాలుగా పరిగణించాలని, నిర్దేశిస్తూ ఇటలీ సంధి ఒడంబడికలో ఒక షరతు ప్రత్యేకంగా చేర్చబడింది. ఎరిట్రియా ప్రజల అభీష్టాన్ని ఎరిట్రియా స్థితిగతులను విచారించడానికి 5 రాజ్యాల ప్రతినిధులతో కూడిన ఒక కమీషన్ నియమింపబడేను. ఈకమీషన్‌లో ఈ క్రింద చెప్పిన దేశాలకు ప్రాతినిధ్యం ఇవ్వబడినది:—బర్మా, గాటెమేలా, నార్వే, పాకిస్తాన్, దక్షిణ ఆఫ్రికా. విచారణసంఘం 1950 జూన్ 15వ తేదీలోగా సమితికి నివేదిక అందజేయవలెనని అసెంబ్లీ షరతుపెట్టింది.

ఈ 3 సమస్యలమీద వోటింగు యీ విధంగా జరిగింది:

1. లిబియాకు స్వాతంత్ర్యం యివ్వడం. 49 మంది అనుకూలంగా వోటు చేసిరి; 9 మంది తాటస్థ్యం వహించిరి; ప్రతికూలంగా యెవ్వరూ వోటుచేయలేదు. తాటస్థ్యంవహించిన దేశాలు: రష్యా, రష్యా ఉపగ్రహరాజ్యాలు, ఫ్రాన్సు న్యూజీలాండు, స్వీడెన్, యుగోస్లావియా.

2. సోమాలీలాండ్‌పై ఇటలీ ధర్మకర్తృత్వం. 48 మంది అనుకూలంగా వోటుచేసిరి. 7 గురు ప్రతికూలంగా వోటు చేసిరి; 3 గురు తాటస్థ్యంవహించిరి. ప్రతికూలంగా వోటు చేసిన దేశాలివి. రష్యా, రష్యన్ ఉపగ్రహరాజ్యాలు; యుగోస్లావియా, ఎథియోపియా. తటస్థదేశాలు లైబీరియా, న్యూజీలాండ్, స్వీడన్.

3. ఎరిట్రియామీద నిర్ణయం వాయిదా వెయ్యడం. 47 మంది అనుకూలత ప్రదర్శించిరి; 5 గురు ప్రతికూలత చూపించిరి. 6 గురు తాటస్థ్యంవహించిరి. తాటస్థ్య దేశాలివి: ఎథియోపియా, గ్రీస్, లైబీరియా ఫిలిప్పైన్లు, సౌదీ అరేబియా, యుగోస్లావియా. తీర్మానంలోని 3 భాగాలమీద విడివిడిగా వోటుచేయడం అయిన తర్వాత తీర్మానాన్ని ఏకగ్రీవంగా వోటుకు పెట్టడం అయింది. ఏకమొత్తంగావోటుకు పెట్టినప్పుడు తీర్మానానికి అనుకూలంగా 49 వోట్లు వచ్చినవి; 9 దేశాలు తటస్థంగా ఉరుకున్నవి; ఒక్క ఎథియోపియా మాత్రం తీర్మానానికి వ్యతిరేకంగా వోటు చేసింది. ఈ సందర్భంలో ఎథియోపియా ప్రతినిధి ఉపన్యసిస్తూ సోమలీలాండ్ ధర్మకర్తృత్వ ఒడంబడిక రచనలో ఎథియోపియాకు పాల్గొన నివ్వవలెననీ, సోమలీలాండ్ వ్యవహారాలలో ప్రత్యక్ష సంబంధం ఉన్న దేశం ఏదైనా ఉంటే, అది ఎథియోపియాయే అని వాదించెను.

సోమలీలాండ్‌పై ధర్మకర్తృత్వ నిర్వహణలో ఇటలీకి సలహా ఇస్తూ ఉండడానికి గాను ఈజిప్టు, ఫిలిప్పైన్సు, కొలంబియా దేశాల ప్రతినిధులతోకూడిన ఒక సలహా సంఘం నియమించబడింది. రష్యా ప్రతినిధి అరుటినియన్, సోమలీలాండుపై ఇటలీకి ధర్మకర్తృత్వం ఇవ్వాలన్న నిర్ణయాన్ని ప్రతిఘటిస్తూ, ఇటలీ అప్పుడే సోమలీలాండ్‌ను ఆక్రమించేయడానికి సైన్యాలను సన్నద్ధం చేస్తున్నదనీ, 900 మంది సైమానికులను సాయుధసైనికులుగా చేర్చి ఇటలీ ఒక దళాన్ని తయారుచేస్తున్నదనీ,

## చైనా కమ్యూనిస్టు ప్రభుత్వ పరిగణన సమస్య

### బ్రిటిష్ మంత్రులతో కృష్ణమీనన్ చర్చ

లండన్, నవంబరు 21: లండన్‌లో భారత హైకమిషనర్ కృష్ణమీనన్ ఈవేళ బ్రిటిష మంత్రులతో చైనాకమ్యూనిస్టు ప్రభుత్వం పరిగణనవిషయమై చర్చలు సాగిస్తు కుణంతీరిక లేకుండా గడిపాడు. విదేశాంగమంత్రి ఎర్నెస్ట్ బెవిన్, ఖజానా మంత్రి సర్ స్టాఫర్డ్ క్రిప్స్, ఆరోగ్యశాఖ మంత్రి అనీయర్ బివాన్ గారలను కలుసుకొని సంప్రదించాడు.

చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించడమా మానడమా గుర్తిస్తే ఎప్పుడు గుర్తించాలి. అనే విషయమై, కృష్ణమీనన్ లండన్‌లోని కామన్వెల్తురాజ్యాల హై. కమీషనర్లతోకలసి, బ్రిటిష్‌ప్రభుత్వంతో యిటీవలే సంప్రదించాడు. కామన్వెల్తులో ఉన్న యేరాజ్యమైనాసరే, త్వరలో చైనా కమ్యూనిస్టుప్రభుత్వాన్ని గుర్తించడానికి ఏ అభ్యంతరము ఉండగూడదని భారతప్రభుత్వం వాదించినట్లు తెలుస్తున్నది.

ఈ వేళ చర్చలసందర్భంలోకూడా చైనా కమ్యూనిస్టుప్రభుత్వాన్ని త్వరలో గుర్తించాలని కృష్ణమీనన్ గట్టిగా చెప్పినట్లు తెలియవచ్చింది.

ఆరోపించెను. పాలక రాజ్యాల యోగక్షేమాలను కాపాడడానికే ఈ తీర్మానం రచించబడినట్లుగా ఉన్నదని ఆయన అన్నాడు.

ఫ్రెంచి ప్రతినిధికూడా సోమలీలాండుపై ఇటలీకి ధర్మకర్తృత్వాధికారం ఇవ్వడాన్ని విమర్శించెను. తూర్పు ఆఫ్రికాలో సంక్షోభం రేపిపెట్టడానికి ఇది ఒక చక్కని సాధనంగా ఉపయోగపడుతుందని ఆయన అన్నాడు.

ఇటలీ కరడుగట్టిన సామ్రాజ్యవాదిఅనీ, ఇటలీలో ఏదో మార్పు వస్తుందని కాము పెట్టుకున్న ఆశలన్నీ నిరాశలైననీ, ఎథియోపియా ప్రతినిధి ఆక్లిలూ అనెను.

సమావేశం అప్పటికి అంతటితో ముగిసింది; కొలది గంటల వ్యవధి అనంతరం అసెంబ్లీ నేడు తిరిగి సమావేశం అవుతుంది.

## ధర్మకర్తృత్వసంఘంలో దక్షిణ ఆఫ్రికా ఉక్రోషం

లేక్‌సక్సెస్, నవంబరు 20: నైరృతి ఆఫ్రికామీద గత శుక్రవారంనాడు చర్చ జరిగిన సందర్భంలో కొన్ని దేశాల ప్రతినిధులు దక్షిణఆఫ్రికా కుటుంబ వ్యవహారాలను రచ్చకీడ్చినది. ఆఫ్రికాను అల్లకల్లోలం చేసి ఆ ప్రయత్నాన్ని గర్హించి ఆధిక్షేపణ తెలుపగోరుతున్నాననీ, దక్షిణఆఫ్రికా ప్రతినిధి వర్గ నాయకుడు జి. పి. జూస్టు ఈవేళ ధర్మకర్తృత్వ సంఘంలో ఉపన్యసిస్తూ చెప్పెను.

జనరల్ అసెంబ్లీకి అన్యతుతపసించిన జనరల్ కాన్స్ కోమ్యులో సమితిలో చర్చలు ఔచిత్యం తప్పకుండా మానడానికి తన శాయశక్తులా ప్రయత్నిస్తుండగా ఆదేశపు ప్రతినిధే ఒకరు ధర్మకర్తృత్వ సంఘంలో ఈ విధంగా కట్టుదప్పి మాట్లాడడం శోచనీయమని ఆయన అన్నాడు. నైరృతి ఆఫ్రికా మాండేటును పట్టి, నైరృతి ఆఫ్రికాను దక్షిణాఫ్రికాలో అంతర్భాగంగా చేర్చి పరిపాలించడానికి తమకు అధికారం ఉన్నదనీ, అదీగాక కొత్త ఏర్పాట్లప్రకారం నైరృతి ఆఫ్రికా ప్రజలకు శాసనసభలో ప్రాతినిధ్యం కూడా ఇవ్వబడిందనీ జూస్టు అనెను. అనంతరం ఫ్రెంచి ప్రతినిధి రోజర్‌గారో మాట్లాడుతూ, మాండేటరీ ప్రాంతములను ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వమునకు అప్పగించవలసే మానవలసే అన్నది వారి వారి స్వేచ్ఛకు వదలిపేయ బడినదనీ, నైరృతి ఆఫ్రికాను సమితి ధర్మకర్తృత్వమునకు అప్పగించినట్లయితే, తమ కుటుంబవ్యవహారాలనుకూడా పక్షాలు కెలకడం మొదలు పెడతారన్న సంకోచంతో దక్షిణ ఆఫ్రికా అపని చేయలేదనీ, దక్షిణాఫ్రికాను ఎవరు నిందింపలేరనీ అనెను.

## కమ్యూనిస్టుల కిరాత కృత్యములు

### సోషలిస్టులకు సమ్మతము లేదు

#### శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ప్రకటన

కటకము, నవంబరు 21: కమ్యూనిస్టుల ఘాతుకచర్యలు సోషలిస్టు పార్టీకి ఎంత మాత్రమును సమ్మతముకాదని యిచ్చట నిన్న జరిగిన మహాసభలో సోషలిస్టుపార్టీ నాయకుడు శ్రీ జయప్రకాశ్ నారాయణ్ గారు ప్రకటించిరి.

శ్రీ జయప్రకాశ్ గారు కమ్యూనిస్టుల దుష్కార్యముల విషయమై ప్రస్తావించినప్పుడు సభపై కొద్దిగా రాళ్లుపడెను. ఐనప్పటికి సభ శాంతముగా జరిగిపోయెను.

సభకు పూర్వము సోషలిస్టునాయకుడు బాలసోర్, మయూర్ భంజ్ పర్యటనము ముగించుకొని యిచ్చటికి రాగానే కొంత మంది నల్లజండాలు పట్టుకొని ప్రదర్శన మొనర్చిరి. నాటి తీవ్రములగు పోరాటములు జరిగెను.

మహాసభలో శ్రీ జయప్రకాశ్ నారాయణ్ గారుపన్యసించుచు కమ్యూనిస్టులు భారతదేశమును రష్యాచెప్పు చేతలలోని రాజ్యముగాచేయు ప్రయత్నమున విఫలమనోరథులై నమీదట భారతదేశమును విచ్ఛిన్నముగావింప బ్రయత్నించిరనిరి. హైదరాబాదు స్వతంత్రము కావలెనని, కాశ్మీరు స్వతంత్రముకావలెనని వారు కోరిరనిరి. జనసామాన్యముయొక్క సహాయ సంపత్తితో తాను భారత కమ్యూనిస్టు పార్టీని విచ్ఛిన్నము గావింపనాశించుచుండెననిరి.

కాంగ్రెసు ప్రభుత్వము సరిగా వ్యవహారములను నిర్వహించుటలేదని శ్రీ జయప్రకాశ్ గారు చెప్పుచు భారతదేశములో బలియమగు ప్రతిపక్షముండుటెంత అవసరమో సభాసదులకు స్పష్టపరిచిరి. సాయంసమయమున ఒరిస్సా హైకోర్టు న్యాయమూర్తి శ్రీ జె. దాస్ గారను వారి ధర్మపత్నియు శ్రీజయప్రకాశ్‌గారికి విందు చేసిరి. సోషలిస్టు నాయకురాలగు ఒరిస్సా గవర్నర్ భార్య శ్రీమతి అరుణ అసఫాలీ సరి విందులో పాల్గొనెను.

## మెట్రిక్ విధానం

### ప్రవేశానికి కాలపరిమితి విషయంలో అభిప్రాయ భేదాలు

బొంబాయి, నవంబర్ 21: తూలతలు, కొలతలలో ఇండియా మెట్రిక్ విధానాన్ని అమలుజరపబోతున్న దంటే బ్రిటన్‌తో ఉన్న మరొక సంబంధాన్ని తెంచుకుంటున్న దన్నమాట. స్టాండర్డ్స్ కమిటీ వారు యీ కొత్త పద్ధతిని అమలుజరపటానికి 15 ఏళ్లు కాలవ్యవధి యివ్వటం అనవసరమని కొందరు భావిస్తున్నారు కాని కమిటీ మొదట మూడేళ్ళలోనే కొత్త పద్ధతిని ప్రవేశపెట్టాలని అనుకున్నది చివరకి విధంగా మార్చటానికి బలమైన కారణాలే ఉండవచ్చునని అనుకోవలసి ఉన్నది.

కొలతలకు మీటర్లనూ దూరానికి గ్రాములనూ పెట్టినిక్కా దానికి దానికన్నా పెద్దమానం 10 రెట్లు ఉంటేట్లూ, చిన్నమానం పదోవంతు ఉంటేట్లూ యీ విధంగా దశాంశపద్ధతిలో అమర్చటమా లేక ప్రస్తుత కొలమానాల నూ తూకాలనూ ఉంచి వాటిని దశాంశపద్ధతిలో అమర్చటమా అన్న చర్చవచ్చినప్పుడు మొదటి పద్ధతే అనుసరణీయమని స్టాండర్డ్సు కమిటీ సూచించింది. దీనిని ఆచరణలోకి తీసుకునివచ్చే ముందు చాలా ప్రచారం అవసరం. బొంబాయిరగ్గాల వారు కొత్తపద్ధతి 5 ఏళ్ళవ్యవధిలో ఫలాని తేదీనుంచీ అమలులోకి వస్తుందని ప్రకటించటం మంచిదని భావిస్తున్నారు.

మెట్రిక్ విధానం 1801 లో ఫ్రెంచిరిపబ్లిక్‌లో ప్రవేశపెట్టబడినది. మీటర్ పొడుగుగల ప్లాటినం ఇరిడియం మిశ్రమలో హపుకడ్డీ ఒకటి ప్రపంచానికంతటికీ కొలతకర్రగా పారిస్‌లో భద్రపరచబడి ఉన్నది. దశాంశ పద్ధతిలో బ్రిటన్, గ్రామీలనూ, దశాంశ పద్ధతిలోనే దవ్యమానాన్నీ కూడా ప్రవేశపెడితే ఇండియా ప్రపంచంలోని ఇతరదేశాలన్నిటితో పాటుగా ఉంటుంది. అవిధంగా మెట్రిక్ విధానాన్ని, దశాంశపద్ధతిలో ద్రవ్యమానాన్ని పెట్టుకోకుండా కేటాయింపుగా ఉన్న దేశం బ్రిటన్ ఒక్కటే.

## పాకిస్తాన్‌లో సోవియట్ రాయబారి

కరాచీ, నవంబరు 21:— సోవియట్ రష్యా కరాచీలో దానిని ఇవాన్‌ని కొలోమీన్‌ని తను రాయబారిగా నిర్ణయిస్తూ చేసిన నియామకాన్ని పాకిస్తాన్ ప్రభుత్వం ఆమోదించినదని నేడు అధికారరీత్యా ప్రకటించబడినది. కరాచీ సోవియట్ రాయబారి, మాస్కోలో పాక్ రాయబారి, ఇద్దరూ ఒకేసారి తమ పదవులను స్వీకరిస్తారు.

## పంచదారపైన ఎక్సయిజు పన్ను రద్దు

### పారిశ్రామికులకు సర్దార్ పటేల్ విజ్ఞప్తి

న్యూఢిల్లీ, నవంబర్ 21: పంచదార ఉత్పత్తులను, కడచిన 1948-49 సంవత్సరముకంటే 1949-50 లో రేమాత్రం యెక్కువ ఉత్పత్తిచేయగలిగినా ఆ వ్యాపార సంస్థలనుంచి ఎక్సయిజుపన్ను తీసుకోకుండా మొత్తంగా రద్దు చేయటానికిభారత ప్రభుత్వం నిర్ణయించింది.

కడచిన శుక్రవారంనాడు భారత ఉపప్రధాని సర్దార్ పటేలుగారూ, ఖజానా, వ్యవసాయశాఖల మంత్రులూ, పంచదార పారిశ్రామికులను కలుసుకుని పరిశ్రమ యొక్క స్థితిగతులను గురించి సంప్రదించారు. ఈ సమావేశానికి, లాలా శ్రీరాం, కరంచెంద్ థాపర్, యస్. పి. జయిన్, 'ఇండియన్ సుగర్ సిండికేట్' అధ్యక్షులు నరాంగ్, బి. యం. బిర్లా, ఓమెల్లే మొదలైన పంచదార పారిశ్రామిక ప్రముఖులంతా హాజరైనారు.

సర్దార్ పటేల్ ఈ సమావేశములో ప్రసంగించుతూ, పంచదార ఫ్యాక్టరీలు వెంటనే పని ప్రారంభించవలసిన అవసరాన్ని గురించి వీరందరికీ నచ్చచెప్పారు. పారిశ్రామికులుకూడా ఉత్పత్తులను పెంచే విషయంలో తమకుగల అభిలాషను ప్రకటించారు.

పారిశ్రామికులు ఈ దిగువ విషయాలు తెలియజేశారు.

"ఈ తరుణంలో చెరుకులో ఎక్కువ పానకం వుండదు. అందుచేత ఇప్పుడు పంచదార తయారీకి వెంటనే పూనుకుంటే పరిశ్రమకు బాధదాయకంగా వుంటుంది. వెంటనే పని ప్రారంభం కావాలంటే ప్రభుత్వం బాగా సాయపడాలి. ఈమధ్య ప్రభుత్వం ప్రకటించిన ఎక్సయిజు సుంకం తగ్గింపు, రైలుపన్ను తగ్గింపూ ఈ రకం స్వల్ప సదుపాయాలు చాలవు. పంచదారకు ఇప్పుడు ప్రభుత్వం నిర్ణయించిన రు. 28-8-0 ధర చాలదు. దీన్ని పెంచాలి. సరఫరా యిబ్బందులూ, పెట్రోలు కొరతా లేకుండా ప్రభుత్వం సాయపడాలి" అని తెలియజేశారు.

ప్రభుత్వం ధర పెంచటానికి వీల్లేదని స్పష్టీకరించింది. తక్కిన కోరికలను గురించి విచారించటానికి హామీ యిచ్చారు.

ఈ నిర్ణయాన్ని పురస్కరించుకునే ప్రభుత్వం, 1949-50 లో అధికోత్పత్తి చేయగల్గిన సంస్థలకు ఎక్సయిజు పన్ను రద్దుచేయటానికి నిర్ణయించింది. వివరములతో ప్రకటనత్వరలో వెలువడుతుంది.

## పారిశ్రామికుల నిర్ణయం

సర్దార్ పటేల్ విజ్ఞప్తిని పురస్కరించుకుని 'ఇండియన్ సుగర్ సిండికేట్' వారు వెంటనే అన్ని ఫ్యాక్టరీలూ పని ప్రారంభించాలని నిర్ణయించారు. బీహార్, సంయుక్త రాష్ట్రాలలోవున్న 95 ఫ్యాక్టరీలూ డిశెంబర్ మొదటి తేదీకి పని ప్రారంభించి, ఈఋతువులో ఉత్పత్తి కావలసిన మొత్తం 11 లక్షల టన్నులనూ భర్తీ చేయడానికి ప్రయత్నించగలరని తెలుస్తున్నది. మొదటో పశ్చిమ ప్రాంతాల ఫ్యాక్టరీలు డిశెంబర్ మొదటి వారంలోనూ, మధ్య ప్రాంతాల ఫ్యాక్టరీలు డిశెంబర్ రెండోవారంలోనూ, తూర్పు ప్రాంతాల ఫ్యాక్టరీలు జనవరి మొదటితేదీతోనూ పనిప్రారంభించాలనుకున్నారు.

సిండికేటు అధ్యక్షులు దేవరాజ్ నరాంగ్, వెంటనే పనిప్రారంభించాలని ఫ్యాక్టరీలన్నిటికీ ఉత్తరువులు జారీ చేశారు.

## రక్షణశాఖలు మూటికి నెహ్రూ సందేశం

న్యూఢిల్లీ, నవంబరు 21: తన షష్టిపూర్తి మహోత్సవ సందర్భంలో అందచేయబడిన అభినందలకు సమాధానంగా, రక్షణశాఖలు మూడింటి అధికారులకూ ప్రధాని నెహ్రూ యీ దిగువ సందేశాన్ని అందజేశారు:

'రక్షణశాఖలు ఈనాడు, కేవలం, దేశ ప్రజాస్వాతంత్ర్య రక్షణకు గాను యుద్ధ కార్యక్రమాన్ని నిర్వహించవలసిన సంస్థలు మాత్రమే కాదు. శాంతి సమయంలో కూడా, అనేక విధాలుగా దేశానికి సేవ చేయవలసిన బాధ్యత వుంటుంది. ప్రజానీకంలో ఉదయించి వారిలో బలమైన వర్గంగా తయారు కావాలి. మన రాష్ట్ర గర్గకుండి తత్వాలని అధిగమించి పైకి లేవవలసి వుంటుంది.

నవభారత నిర్మాణంలో రక్షణశాఖలు ప్రధానమైన పాత్రను నిర్వహించాలి. గడచిన క్లిష్ట సంవత్సరాలలో, రక్షణశాఖలు అద్భుతమైన సౌశీల్యాన్ని ప్రదర్శించి, క్రమేపి ప్రజలకు సన్నిహితులౌతున్నందుకు నేను చాలా ఆనందిస్తున్నాను.

'నేను యీ మధ్య విదేశాలలో పర్యటించిన తరుణంలో, ఇతర పెద్ద పెద్ద రాజ్యాలలోని రక్షణశాఖాధికారులు మనవారిని గురించి పెద్దగా చెప్పుకోవటం నేను విన్నాను' అని తెలియజేశారు.

# నూతన రాజ్యాంగంలో కేంద్ర ప్రభుత్వానికి విశేషాధికారాలు

## పరిషత్తులో సభ్యుల తీవ్ర విమర్శ: అల్పసంఖ్యాకులకు తగ్గ రక్షణలులేవని సభ్యుల అసంతృప్తి

న్యూఢిల్లీ, నవంబరు 21: ఈవేళ రాజ్యాంగపరిషత్తులో రాజ్యాంగానికి మూడవ ప్రతిపాదన జరిగే సందర్భంలో మరి ఒక 14 గురు నూతన రాజ్యాంగాన్ని విమర్శించారు. వీరిలో ఆమోదం తెలిపినవారికంటె, విమర్శించినవారే ఎక్కువగా వున్నారు. నిమ్న జాతుల ప్రతినిధులైన నాగప్ప, ఖండేకరులు రాజ్యాంగంవిషయంలో కొంతవరకు తమ అంగీకారం తెలియజేశారు. మిగిలినవారిలో చాలా మంది రాజ్యాంగాన్ని తీవ్రంగా నిరసించారు; ఒకరిద్దరు సగం సగం సమర్థించారు.

సిక్కు ప్రతినిధులు సర్దార్ భూపేంద్రసింగ్, సర్దార్ హుకుమ్ సింగ్‌లు సిక్కులకు చాలా అన్యాయం జరిగిందనీ, అందుచేత రాజ్యాంగానికి తమ అంగీకారం తెలియజెయ్యలేమనీ అన్నారు.

చాలామంది వక్తలు ఈ రాజ్యాంగములో కేంద్రీకరణం చాలా ఎక్కువగా ఉన్నదని విమర్శించారు.

మహమ్మదీయ సభ్యులు, రాజ్యాంగ రచనాసంఘంలో సభ్యులుగాఉన్న మహమ్మద్ సాదుల్లాకూడా రాజ్యాంగంలో కేంద్రీకరణాన్ని గురించి విమర్శించారు.

అరుణచంద్రగుహా, శంకరరావ్ దేవ్, పి. టి. చాకోలు రాజ్యాంగానికి చాలా వరకు తమ ఆమోదం తెలియజేశారు. ఐతే ఈరాజ్యాంగంలో కొన్నిచట్టాలు జర్మను రాజ్యాంగ చట్టాలలాగ ఉన్నాయని విమర్శించారు. గుహా ఈ రాజ్యాంగం అతుకుల బొంతలాగ ఉన్నదనీ, ప్రెసిడెంటు అధికారాలు హిట్లరు అధికారానికి వచ్చే ముందు జర్మనీ ప్రెసిడెంటు అధికారాల మోస్తరుగా ఉన్నాయనీ అన్నారు.

ఆ పిమ్మట శంకరావ్ దేవ్ మాట్లాడుతూ, ఈ రాజ్యాంగంలో ప్రెసిడెంటు డిక్టేటరు కావడానికి అవకాశాలు చాలా ఉన్నాయని అన్నారు. ఆ తరవాత చాకో మాట్లాడుతూ, ఇదంతా కేంద్రీకృత రాజ్యాంగమనీ, దీనికీ హిట్లరు వచ్చే ముందు జర్మనీ రాజ్యాంగానికీ చాలా పోలికలున్నాయనీ అన్నారు.

గుహా, శంకరరావ్ దేవ్‌లు ఈరాజ్యాంగంలో గాంధీ ఆదర్శాలు లేవనీ, ఇది ఉక్కుచట్రంలాగ ఉన్నదనీ, దీనిప్రకారము జనాభివృద్ధి జరగడం కష్టమనీ అన్నారు.

## చర్చ వివరములు

న్యూఢిల్లీ, నవంబరు 21: నూతన రాజ్యాంగాన్ని ఆమోదించాలన్న తీర్మానంపై నేడుకూడా రాజ్యాంగపరిషత్తులో చర్చ సాగింది.

సర్దారు భూపేంద్రసింగు (తూర్పు పంజాబు) మాట్లాడుతూ, సిక్కులు ఈ రాజ్యాంగాన్ని పూర్తిగా బలపరచరనీ, కేంద్రానికి అధికారాలు చాలా జాస్తిగా ఉన్నవనీ, మిగిలిన రాష్ట్రాలతో పోల్చితే కాశ్మీరు ప్రతిపత్తి బాగున్నదనీ, మద్యనిషేధాన్ని సూచనావళిలో మాత్రమే చేర్చడం శ్లాఘనీయమనీ, సిక్కు-హిందూ నిమ్నజాతులకు ఒకే ప్రతిపత్తి నిచ్చేప్రయత్నం కొంతవరకు విఫలమయిందనీ నిమ్నజాతులకు సైన్యంలో ఇవ్వబడిన అవకాశాలను సిక్కులు ప్రతిఘటించారనీ అన్నారు.

కాజీ సయ్యద్ కరీముద్దీన్ (సి. పి) మాట్లాడుతూ, చాలావరకు రాజ్యాంగం రచన అమోదకరమేననీ ఇండియా లౌకిక రాజ్యం కావడమూ, ప్రాథమిక హక్కులూ, అందరు పౌరులకూ సమానావకాశాలూ బాగున్నవనీ, ఈ రాజ్యాంగాన్ని శ్రద్ధగా అమలు జరపాలనీ, అందుకు ప్రజలూ దీనిని ఆమోదించాలనీ అంటూ, వయోజనుల చేత ఎన్నుకోబడక, అధిక సంఖ్యాక వర్గానికి గులాముగా ఉండే అధ్యక్షుడికి విశేషమైన అదనపు అధికారా లున్నందుకు విమర్శిస్తూ, కేంద్రంలోనూ రాష్ట్రాలలోనూ నిరంకుశ పక్షాల వారు అధికారంలోకి వస్తే రాజ్యాంగం అమలు జరగదనీ, విధానాలు కలిగినంత మాత్రం చేత రాజ్యాంగం అమలు జరగడం నిలచిపోకుండా కేంద్రం చూడాలనీ, అన్నారు.

అరుణ చంద్ర గుహా (బెంగాలు) మాట్లాడుతూ, ఈ రాజ్యాంగం విప్లవంలో నుంచి ఉద్భవించి నప్పటికీ ప్రజల ఆశయాలను గాని విప్లవ శక్తులను గాని ప్రతిఫలించ లేదనీ, స్వాతంత్ర్య సమరమప్పుడు ప్రజలలో ఉండిన సాంఘిక, ఆర్థిక విశ్వాసాలను ఈ రాజ్యాంగం ప్రతిబింబించడం లేదనీ, ఇందులో గాంధీ తత్వం గోచరించడం లేదనీ, అయినప్పటికీ అప్పుడైతే, ప్రత్యేక నియోజక వర్గాలూ, సంస్థానాలూ మాయం కావడమూ, నాణెం కేంద్రం అమలు కావడమూ చెప్పుకోతగినదనీ, సంఘం స్థాయిత్వం పొందడం కూడ ప్రాథమిక హక్కులకు సంబంధించడం అవసరమనీ హిట్లరు పదవికి వచ్చినప్పుడు జైన్ అధ్యక్షుడికున్న అధికారాలవంటివి యూనియను అధ్యక్షుడి కివ్వబడినవనీ, ఇండియా ఫెడరేషనులో రాష్ట్రాలు కేంద్రానికి అధికారా లివ్వడానికి మారుగా కేంద్రంనుంచి ఫెడరేషను ఆరంభమై కిందికి నిర్మించబడిందనీ అన్నారు.

మహారాష్ట్ర కాంగ్రెసు నాయకుడు శంకరరావుదేవు మాట్లాడుతూ, రాజ్యాంగంలో రాజకీయ స్వాతంత్ర్యమూ, ప్రజాస్వామ్యమూ పూర్తిగా ఉన్నప్పటికి మహాత్ముని సాంఘిక ఆర్థిక ఆదర్శాలు ఇందులో అనులుకాలేదనీ, బుద్ధిపూర్వకంగా ఆయనకు అన్యాయం చేయడానికై కాక "మనం దుర్బలులమై ఆయన సిద్ధాంతాలు ఆమోదించ లేకపోయిన కారణంచేత" అని లోపించినవనీ, ఈరాజ్యాంగం నొప్పరచనే కాని ఇదిమరి దీర్ఘమై పోయిందనీ, ఇందువల్ల జాతియొక్క పెంపునకు ఇది అడ్డంగా ఉండవచ్చుననీ, యూనియను అధ్యక్షుడికి అమెరికా అధ్యక్షుడి కున్నంత అధికారాలు గాని, ఫ్రెంచి అధ్యక్షుడి కున్నంత తక్కువ అధికారాలుగాని లేవనీ, అయినప్పటికీ నియంత కావడానికి మన అధ్యక్షుడికి అవకాశం ఉన్నదనీ, ప్రజలు తమ ఆదర్శాలనూ ఆశయాలనూ విస్మరించకుండా ఉంటే ఈ రాజ్యాంగంద్వారా అహింసా యుతమూ, దోపిడి విధాన రహితమూ అయిన సమాజం స్థాపించి అందరికీ సమా నావకాశాలు కల్పించ వచ్చుననీ అన్నారు.

తూర్పుపంజాబుకు చెందిన భారత రాజ్యాంగాన్ని మాట్లాడుతూ, సిక్కులకు ఈ రాజ్యాంగంలో చాలా అన్యాయం జరిగిందనీ, తమకు ఈ రాజ్యాంగం ఎంత మాత్రము సమ్మతం కాదనీ, కమ్యూనిస్టు రాజ్యాంగంలోనే ప్రజలందరికీ సమానమైన హక్కులు కలగగలవనీ, ప్రెసిడెంటుకు ఈ రాజ్యాంగంలో నియంత కాగల అవకాశాలున్నాయనీ, సిక్కులకు పంజాబీ మాట్లాడే వారికి ప్రత్యేకరాష్ట్రం చాలా అవసరమనీ, చెప్పారు.

ఆ తరవాత మద్రాసు ప్రతినిధి ఎమ్. ఎస్. నాగప్ప ఇలాగ అన్నారు. "నేను రాజ్యాంగానికి సంపూర్ణంగా అమోదిస్తున్నాను. నిమ్న జాతుల కోరికలున్నించి, వారికి ప్రత్యేకస్థానాలు ఏర్పాటు చేసినందుకు నేను అగ్రజాతులవారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. వయోజనులకు ఓటింగుహక్కు రావడంవల్ల వారు త్వరలోనే పెట్టుబడిదారులను ప్రభుత్వంలోనించి తొలగించి వెయ్యగలరని ఆశిస్తున్నాను. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం ఇచ్చినందుకు అధిష్ఠానవర్గంవారిని మనసారా అభినందిస్తున్నాను."

ఆ పిమ్మట జస్పత్ రాయ్ కపూర్ మాట్లాడుతూ, ఈ రాజ్యాంగం అన్ని వర్గాలవారికి యథోచితంగా న్యాయం కలగజేసిందనీ, డాక్టరు సంపూర్ణానంద్ ఈ రాజ్యాంగం తీవ్రంగావిమర్శించడం చాలా శోచనీయమనీ అయితే గాంధీ ఆదర్శాలు అన్నీ ఇందులో చేర్చడానికి వీలులేకపోయిందనీ ఇంగ్లీషు అంకెలు ఉండకూడదని అన్నారు.

అనంతరం అల్గురాయ్‌శాస్త్రి మాట్లాడుతూ, రాజ్యాంగావర్గాలలో అందరికీ తిండి, గుడ్డ ఇచ్చేవిషయంలో పూచీపడలేదనీ, రాజ్యాంగతర్జుమా హిందీలోనికి అనువదించాలనీ అన్నారు.

ఆటుపిమ్మట బీహారు ప్రతినిధి అమియ కుమార్‌ఘోష్ మాట్లాడుతూ, ప్రపంచంలో ప్రతీ వస్తువులోనూ, ఉన్నట్టే ఈ రాజ్యాంగంలో మంచి, చెడ్డాకూడా ఉన్నాయనీ అయితే, సంస్థానాల ఏకీకరణము చాలా గొప్ప విషయమనీ, అయితే పార్లమెంటుకే ఎక్కువ విషయాలలో అధికారం ఇచ్చివుండవలసిందనీ, న్యాయ, కార్యనిర్వాహకశాఖల విభజన జరగలేదనీ, ప్రెసిడెంటుకు ఇచ్చిన అధికారాలవల్ల ఆతను నియంతఅయ్యే ప్రమాదం ఉన్నదని చెప్పారు.

అపిమ్మట కార్యక్రమం రేపటికి వాయిదాపడింది.

## మూటాముల్లే గట్టుకొని ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి-అరవసోదరుల వీడ్కోలు

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు, అందుకు సంబంధించిన అన్ని విషయములూ తీర్మానించినవి.

'కాలవాహిని' —సెంకర్స్ వీక్లీ సౌజన్యంతో

## ప్రపంచమునకు శాంతి చేకూర్చగలదిఅహింసాధర్మ మొక్కటే

### శ్రీమతి రాజకుమారి అమృతకౌరు ఉద్ఘాటన

న్యూఢిల్లీ, నవంబరు 21: ఇండియా ప్రభుత్వ ఆరోగ్యశాఖామంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృతకౌరు ఢిల్లీ అ. భా. రేడియోనుండి 'అటంబాంబుకు జవాబు ఒక్క అహింసయే' అను విషయమై ఉపన్యసించుచు ప్రపంచము నెదుర్కొను చున్న ఏ సమస్యనూ అటంబాంబు పరిష్కరింపజాలదని ఉద్ఘాటించిరి.

"ఈ నాడు మారణాస్త్రములలో, నాశహేతువగు ఆయుధములలో తుదిమాట యగు అటంబాంబుయొక్క నీలినిచ్ఛాయలు యావత్ ప్రపంచమును ఆవరించియున్నవి. మానవుడు తోడి మానవులతో సఖ్యభావమున జీవించుటకు మార్గములు కనుగొనజాలకపోవుట, తాను జీవించుటకు గాను వినాశమునకు బూనుకొనవలసి వచ్చుట అత్యంత సంతాపకరము ప్రపంచ ప్రజలు శాంతియుతముగా జీవించగోరెదరేని వారు పరమధర్మమగు అహింసను అవలంబింపవలసియున్నది. అనేక సంవత్సరములపాటు నాకు గాంధిమహాత్ముని సన్నిహిత సాహచర్య భాగ్యము కలిగియుండుటచేతను, ఆతని బోధామృతమును నిండార గ్రోలియుండుటచేతను నే నెంత బలహీనురాలనైనప్పటికీ, మానవకోటి అహింసను మతధర్మముగా నవలంబించిన తప్ప ప్రపంచమునకు శాంతి చేకూరదను దృఢవిశ్వాసము నేర్పడినది. నానాటికి ఈ నమ్మకము మరింత దృఢపడుచున్నది. అహింస మహాశక్తి. గాంధిమహాత్ముని నేతృత్వము చెప్పినట్లు అది బలవంతుల సాధనము. మానవుడు ఈ శక్తి సంపన్నదైవయోగమ్మైన యెంత పాశవశక్తినైన అతడు ప్రతిఘటింపగలడు. అటంబాంబు నెదుర్కొనుటకుగాను మానవుడు మహాకష్టముల ననుభవింప సంసిద్ధుడు కావలెనని, కాని అతడుమాత్రము యితరులకు కష్టము కలిగింపరాదు. ఈ గొప్ప లక్ష్యమునకై అందరు కృషి చేయవలసియున్నది. ఎందువల్లననగా దౌర్జన్యము దౌర్జన్యమునకు కారణభూతమగును." అని శ్రీమతి రాజకుమారి అమృతకౌరు చెప్పెను.

## కేంద్ర ప్రభుత్వ వ్యయకర్తనం

న్యూఢిల్లీ, నవంబర్ 21: కేంద్రప్రభుత్వ వ్యయకర్తన విధానంవల్ల, ఇప్పటికే ప్రారంభింపబడిన లాభసాటి ప్రాజెక్టులేవీ ఆగిపోవలసినపని లేదు.

లాభసాటి గాని లేని ప్రాజెక్టులనుమాత్రమే నిలిపివేయటం జరుగుతుంది. ఇతర ప్రాజెక్టుల విషయంలో పని కొంత నెమ్మదిగా సాగిస్తూవుంటారు. ఇది ఎలాగా తప్పదు. ఎందుచేతనంటే, ముందట అనుకున్నంత తొందరగా విటికి కావలసిన విదేశ చలామణీ మొత్తాలూ, ఇతర నిర్మాణ పరికరాలూ ఇప్పుడు లభ్యం కావు.

రాష్ట్రాలకు ఇచ్చే యుద్ధానంతర గ్రాంటులు 19½ కోట్లనూ 17 కోట్లకు తగ్గించారు. ఈ మొత్తంలో చాలాభాగం సాంఘికాభివృద్ధి కార్యక్రమాలకు వినియోగపడేది.

రాష్ట్రాలకు ఇచ్చే అప్పులకు తగ్గించటంవల్ల మరో 23 కోట్ల రూపాయల వ్యయాన్ని తగ్గించుతారు. పౌరపరిపాలక శాఖ విభ్రమలు వక్ర రాష్ట్రీని రాష్ట్రాల వ్యయాన్ని 5 కోట్లనుంచి 3 కోట్లకు తగ్గించివేస్తారు.

కేంద్రప్రభుత్వం, సాంఘికాభివృద్ధి కార్యక్రమాలక్రింద 2.3 కోట్ల రూపాయలు మాత్రమే కేటాయించుతారు.

ఈ కర్తనములమూలంగా, ప్రస్తుత సంవత్సరం బడ్జెటులో 6 కోట్లూ, 1950-51 బడ్జెటులో 26 కోట్లూ పొదుపు చేల్పటానికి వీలౌతుంది.

అధికాహారోత్పత్తి, పారిశ్రామికాభివృద్ధి మొదలైన లాభసాటి పెట్టుబడులలో మాత్రం యేమీ తగ్గించకపోగా, ఇంకా అహారాభివృద్ధిక్రింద 6 కోట్లు, పారిశ్రామికాభివృద్ధిక్రింద 2 కోట్లూ పెంచారు.

## ఆస్ట్రియా షిల్లింగ్ మారకపు రేటు తగ్గింపు

వియన్నా, నవంబర్ 21: ఆస్ట్రియా షిల్లింగ్ మారకపురేటు తగ్గించబడుతోందని ఆస్ట్రియా ఆర్థికమంత్రి కార్యాలయం నేడు ప్రకటించింది.

ఇకనుంచీ డాలరుకు 14.4 షిల్లింగులు, బ్రిటిష్‌పౌనుకు 40.32 షిల్లింగులు బేసిక్ రేటుగా నిర్ణయించబడినది. డాలరుకు 21.36 షిల్లింగులు, పౌనుకు 59.8 షిల్లింగులు మిక్స్‌డ్‌రేటుగా నిర్ణయించబడినది. విదేశవ్యాపారాల్లో ఆస్ట్రియన్ వ్యాపారులకు వచ్చేద్రవ్యాలకు ప్రత్యేకంగా ఒక ప్రీమియంరేటు - డాలరుకు 26 షిల్లింగులు, పౌనుకు 72.8 షిల్లింగులు - నిర్ణయించబడినది.

పాతరేటు డాలరుకు 10 షిల్లింగులు, పౌనుకు 40 షిల్లింగులు.

## పడమటి ఆఫ్రికాలో కార్మిక అశాంతి

లాగోస్ (నైజీరియా), నవంబరు 21: శుక్రవారంనాడు ఏనుగూ బొగ్గు గనుల ప్రాంతంలో కార్మికులకు పోలీసులకు జరిగిన సంఘర్షణ ఫలితంగా దాదాపు 40 మంది కార్మికులు మరణించారని, ఈ సంఘర్షణ కారణాలను దర్యాప్తు చేయడానికి ఒక కమీషన్‌ను ప్రభుత్వం నియమించింది. గనుల యజమానుల యిండ్లకు కార్మికుల భార్యలు నిప్పంటించగా, పోలీసులు కాల్పులు జరిపినందున యింతమంది మరణించడం, అనేకులు గాయపడడం సంభవించింది.

## శిస్తుతగ్గింపు కార్యాల్లో అక్రమాలు

### అసెంబ్లీసభ్యుల విమర్శ: రెవిన్యూమంత్రిహామీ

చెన్నపట్నం, నవంబరు 22: నేడు ప్రశ్నల కాలానంతరం అసెంబ్లీలో రెవెన్యూమంత్రి సీతారామరెడ్డిగారు రెవిన్యూ పద్దుక్రింద రు 200/- మంజూరు చేయవలెననిరి. చిన్న కోదీర్‌గారు ఒక రూపాయ తగ్గించవలెనంటూ మంత్రుల మాటలకు ఒక నిలకడలేనట్లున్నదనిరి. ఒకప్పుడు పని చురుకుగా జరుగుచుండునందురు. మరొక సారి పని మందగమనముగా ఉన్నదందురనియూ, వారి ప్రణాళికలు, మనస్సులు, కార్యములు నిశ్చయముగా, నిర్దుష్టములుగా ఉండవలెననిరి. జమాలీగారు కోత తీర్మానమును బలపరచిరి.

పైడా వెంకటనారాయణగారు రెండేళ్లుగా శిస్తుతగ్గింపు వ్యవహారం అశాస్త్రీయ పద్ధతులపై జరుగుచున్నదనిరి. జమీందారీలన్నీ ఒక్కసారి తీసుకున్నట్లయితే రాజకీయబాధితులకు భూములు ఇచ్చుటకు వీలు ఉండెడిది. ఇచ్చిన వారికైన తయారీ భూములిచ్చినారు. రాజకీయ బాధితులకు ప్రయోజనకరమైన భూములు సత్వరముగా ఇవ్వవలసిఉండునవనిరి. ఆర్. వి. స్వామినాథన్‌గారు శిస్తు తగ్గింపు ఒక క్రమ విధానంలో జరుగుట లేదనిరి.

ఎన్. ఎస్. వరదాచారిగారు శిస్తు తగ్గింపు వ్యవహారం సత్వరముగా జరుగుచున్నందుకు ప్రభుత్వమును అభినందించిరి. సిబ్బంది తప్పక హెచ్చించవలసినదే. ధాన్యరూపముగా శిస్తు వసూలు అనుచోట్లలో నత్తనల్ల నడకగా పనిసాగుతున్నది. ఈ విషయమై ప్రభుత్వ విధానం విస్పష్టంగా ప్రకటింపనిచో ప్రమాదం విపరీతమగుననిరి. తిరుపతి తిరుమల దేవస్థానంలో 1357 ఫసలీకూడా పాతపద్ధతిపై శిస్తువసూలుచేయుటకు నోటీసుజారీచేసినారనియు ఇదిఅక్రమమనియు వరదాచారిగారు తెలిపిరి. బిల్లు నుంచి మినహాయించిన ఈనాములకు యీ శిస్తు తగ్గింపు వర్తింపరాదు. బిల్లు క్రింద రాని ఒక ఈనాము (నెల్లూరుజిల్లాలో) బిల్లు క్రిందకు వచ్చునని సెటిల్మెంటు డైరక్టరు నిర్ణయించుట అయుక్తము. నెల్లూరు, చిత్తూరు జిల్లాలో ఈనాములని బుజావు చేయుటకు ఈనాందార్ల వద్దగాని ప్రభుత్వంవద్దగాని దాఖలాలు లేనపుడు ఈనాందార్ల నిర్బంధము చేయుట పాడిగాదని తమ అభిప్రాయమనిరి.

తెన్నేటి విశ్వనాథంగారు-శిస్తుతగ్గింపు అధికారులు నోటీసులు ఇవ్వకుండా, ఈనాందార్లను సంప్రదించకుండా అదరాబాదరాగా వ్యవహారములు, జరుపుచున్నారనిరి. నాగావళి, వంశధార నదీ ప్రాంతములలో ఎకరానికి 2-8-0 లకు శిస్తున్నచోటులు లేకపోయినా అంతకు తగ్గించినారు, ప్రభుత్వం ప్రకటించిన కార్యక్రమమును అక్షరశః అధికారులు పాలించవలెను. కోర్టుల తీర్పునకూడా ఈ అధికారులు పాటించుటలేదు. పని తొందరగా చేయవలెనను ఆతృతలో అక్రమము చేయరాదనిరి. ఈ తప్పులు మంత్రిగారు సవరించవలెనని విశ్వనాథంగారు కోరిరి.

కె. భాష్యంగారు శేషుకున్న తక్కువ ప్రకటనకు శిస్తు తగ్గింపబడెననిరి. శిస్తు తగ్గింపులో నిష్పక్షముగా వర్తింపవలెననిరి.

బద్దెపూడి వెంకటనారాయణరెడ్డిగారు మిగతా ఎస్టేట్లను త్వరగా తీసుకొనవలెననిరి. వెంకటగిరిలో ధాన్యంశిస్తులుకొన్ని ద్రవ్యపు శిస్తులుకొన్ని ఉన్నవి. ధాన్యం శిస్తులు కట్టేవారికి న్యాయంగా తగ్గతగినంతవరకు తగ్గలేదు. ధాన్యంశిస్తు ఉండేచోట క్రమంగా రొక్కపు శిస్తులు ఏర్పాటు చేయవలెను. ప్రభుత్వంవారు ఒక ఎస్టేటులో ఉండే రెవిన్యూ ఇన్‌స్పెక్టరునుంచి ఉద్యోగులను మరో ఎస్టేటుకు మార్పించి కొత్తపాత ఉద్యోగులలోను రైతులమధ్య తగాదాలకు అస్కారం లేకుండా చేయవలెను ఎస్టేటు అవునా కాదా విమాంసలో కాలహరణము లేకుండా శిస్తుతగ్గింపు జరిపించవలెనని కోరుచున్నామనిరి. గవర్నమెంటు గ్రామాలలో అనవులు గాకుండానుండే కండెలు పన్నులేకుండా వదలినట్లుగానే జమీందారీ గ్రామాల్లోకూడా అమలు జరుపవలెననిరి.

రెవిన్యూమంత్రి హాల హర్వి సీతారామరెడ్డిగారు విమర్శలకు సమాధానము ఇచ్చుచూ శిస్తుతగ్గింపు పని మార్చి 31వ తేదీతో ముగియగలదని ఆశించుచున్నామనియు, అపుడు ఇంతపెద్ద సిబ్బంది లేకుండా సర్వాపశిష్టమైన ఉద్యోగ బృందమును ఉంచెదమనిరి సెటిల్మెంటు సందర్భమున ఖర్చు సర్వే సెటిల్మెంటులు జరుగువేగముపై అనగా 5, 6 ఏండ్లవరకు సాగవచ్చును. ప్రకటింపబడని చోట్ల 75% శిస్తు జమీందార్లకు ఇవ్వవలెను. అది రైతు ప్రతినిధులకు, జమీందారులకు జరిగిన ఒప్పందముపై వసూలు చేయబడుచున్నది. ప్రకటింపబడని పోటి బాగా లేదు సర్వే సెటిల్మెంటులలో అక్రమములు జరుగకుండా ప్రభుత్వము తగు జాగ్రత్త వహించగలదు. అక్రమ నివారణకు తీవ్రచర్య తీసుకొనగలదు. ధాన్యరూపములో శిస్తులు ఉన్నచోట్ల ప్రభుత్వ ఇక్కట్లులను గౌరవ సభ్యులు గమనించవలెను. ఈ విషయమై అధికారులకు కొన్ని సూచనలు చేసినాము.

ఈ విషయమున తాజా సూచనలు ఇవ్వబడును. ఇక ఈ విషయమై సత్వరం వ్యవహారమున రాగలదని మంత్రిగారు ఆశించుచున్నామనిరి.

పాతపద్ధతిని పెన్షనులు వసూలు జరుగుచున్నచోట ప్రభుత్వము తగు ప్రక్రియ తీసుకొందుమనిరి. గౌరవసభ్యులు తెలిపిన ప్రత్యేక సందర్భములు పరిశీలింపబడును. ప్రభుత్వ సూచనలకు శిస్తు తగ్గింపు అధికారుల అక్రమముల విమర్శకు సమాధానముగా రెవిన్యూబోర్డువారు శిస్తు తగ్గింపు వ్యవహారములను జాగ్రత్తగా పరిశీలించియుందురనిరి. రెండుచోట్ల ఆఫీసర్ల ప్రతిపాదనలు తిరస్కరించబడెననియు, విశ్వనాథంగారి విమర్శను ఖండించుచుందురనిరి. వెంకటనారాయణరెడ్డిగారు తెలిపిన తారతమ్యములు బిల్లులోనే ఉన్నవనియూ ఇందుకు ఎవ్వరూ సహాయము చేయలేరనియూ మంత్రిగారనిరి. సర్వే సెటిల్మెంట్లు పూర్తిఅయినపుడు అందరకు రొక్కపు శిస్తులుఇచ్చినపుడు తాత్కాలికమైన కష్టములు తొలగింపబడునని ఆశించుచున్నామనిరి.

చినకోడూరుగారు రైతులు అటు ప్రభుత్వమునకు గాని, ఇటు ఎస్టేటుదార్లకు గాని డబ్బుఇచ్చుట లేదనియూ, శిస్తువసూలు చేసి, క్వార్ట్ రెంటుక్రింద ప్రభుత్వం వారు జమకట్టుకొనవలెనని తెలిపిరి. తమ కోతతీర్మానమును ఉపసంహరించుకొన్న తర్వాత రెవిన్యూపద్దు ఖర్చు పద్దు సభవారంగీకరించిరి.

## కృష్ణాజిల్లాలో కమ్యూనిస్టులగాలింపు

### 7 గురి అరెస్టు: చాలా నిషేధిత వాఙ్మయం జప్తు

మచిలీపట్నం, నవంబరు 22: స్పెషల్ పోలీసు ప్లాటూన్ సూపరింటెండెంటు టి. పలనియప్పన్ ఈ పట్నంలోనూ, పెడన, వల్లమున్నాడు, గుడివాడలలోనూ కమ్యూనిస్టులకోసం గాలిస్తూ 7 గురిని అరెస్టుచేశారు.

ఈ పూర్వ విద్యార్థుల వసతులు పెతకి అభ్యంతరనీయము, నిషేధితము అయిన వాఙ్మయం స్వాధీనం చేసుకొన్నారు. గత గురువారంనాడు పెడనలో మునగాల రాజగోపాలన్, ఘట్టి నరసింహారావు, గోపాదినారాయణలను కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలనే ఆరోపణపై అరెస్టుచేశారు. వల్లమున్నాడులో ఫాక్టరీవర్కర్స్ యూనియన్ కార్యదర్శి మండల వెంకటేశ్వరరావును అరెస్టుచేశారు; ఈ అరెస్టుల సందర్భంలో కమ్యూనిస్టు కరపత్రాల కట్టలు, నిషేధిత వాఙ్మయం స్వాధీనంచేసి కొన్నట్లు తెలిసింది. నిన్న గుడివాడలో కమ్యూనిస్టు 'సెల్' సభ జరుగుతూండగా, వారిని ముట్టడించి, జిల్లా కమ్యూనిస్టుపార్టీ వారి పరిశ్రాంత శాఖీయులు, వ్రాతప్రతులుగావున్నవి, సైక్లోస్టయిలు తీసినవి స్వాధీనం చేసికొన్నట్లు తెలిసింది మునిసి. పల్ వర్కర్స్ యూనియను కార్యవర్గ సభ్యుడు యర్రంశెట్టి రాముడు, ఫాక్టరీ లేబర్ అసోసియేషన్ ఆర్గనైజరు మేకా బ్రహ్మం, మునిసిపల్ వర్కర్స్ యూనియన్ కార్యదర్శి వగైరా ఆరుగురిలను అరెస్టుచేశారు.

## స్థానికసంస్థలను తెలుగేవాడ నివ్వాలి

### ఆం. రా. కాం కార్యవర్గం తీర్మానాలు

విజయవాడ, నవంబరు 20: ఆంధ్రలోని జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేటప్పుడు తెలుగులోనే వ్యవహరించటానికి అనుమతి నివ్వవలసినదని ఈ మధ్య ఇక్కడ సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గం ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానంచేసింది. స్థానికసంస్థలలో గల కాంగ్రెసువక్షాలు తమ అధికారభాషగా తెలుగునే ఉపయోగించటానికి చర్యలు తీసుకోవలసిందని కూడా కార్యవర్గం కోరింది.

విజయవాడలోని జిల్లాబోర్డు మ్యూజియం భవనములోనే కేంద్రాంధ్ర చిత్రకళా ప్రదర్శనశాల నొకదాని నేర్పాటు చెయ్యాలని ఏకగ్రీవంగా తీర్మానిస్తూ, డి. బలరామకృష్ణయ్యగారు అధ్యక్షుడుగా ఒక యాజమాన్య సంఘమును వారు నియమించారు.

సింధియా నౌకా నిర్మాణశాలలను ప్రభుత్వం జాతీయం చెయ్యాలనీ, జాతీయకరణం కలప్రయమయ్యే పక్షంలో నిర్మాణశాలా కార్మికులు నిరుద్యోగులు కాకుండా మూసివేసిన స్థలం నింధి యూ కంపెనీ చేత క్రొత్త శాఖలనైనా నిర్మింప జేయాలనీ వారు కోరారు.

గండికోట, సంగమేశ్వరం ప్రాజెక్టులను శీఘ్రంగా నిర్మించాలని, నూతన సర్విసు విధానమును, మూడేళ్లకోటా రద్దు చెయ్యకూడదనీ, తుఫానువల్ల నష్టపడిన దేవాలయ మాన్యాలకు, ఇతర దానభూములకు రిమిషన్ మంజూరు చెయ్యాలనీ వారు ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు చేశారు.

(స్వ. వి.)

## కనబడుట లేదు

నా కుమారుడు నెక్కంటి రామయ్య అనే కుర్రవాడు-వయస్సు 16 సంవత్సరములు నలుపు చాయ 4 అడుగుల ఎత్తు-యిప్పటికి 4 మాసముల క్రితం పరారి అయినాడు. ఆ కుర్రవాని ఆచూకి తెలియపరచినారు వప్పగించిన వారికి రు 100/-లు బహుమానము యివ్వబడును.

నెక్కంటి కాళియ్య అనే వాడపల్లి,
పేమవరం - (వయా) ఆచంట,
(పశ్చిమ గోదావరి జిల్లా)

"ఇది నా కడసారి బిడ్డ"

బిడ్డ ఎదుగుదలను చూచి తోడి స్నేహితురాండ్రు ఆశ్చర్యపోతారు. అంత బొద్దుగా, దృఢంగా, అందంగా బిడ్డ పెరిగింది! తల్లి నిజంగా గర్వపడుతుంది. దీనికి కారణం - సెవెన్ సీస్ సర్వశ్రేష్ఠమైన కాడ్ లివర్ ఆయిల్ ప్రసవమునకు ముందు ఆమె ఆరోగ్యమును కాపాడుతుంది- ప్రసవానంతరం, ప్రతిరోజు సెవెన్ సీస్ వాడుతుంటే, భవిష్యత్తున నెలలు యేండ్ల పర్యంతం బిడ్డ ఎదుగుదలకు వికాసమునకు అది తోడ్పడి జబ్బులను తట్టుకొనగల శక్తి యిస్తుంది.

SevenSeaS

PURE COD LIVER OIL

8, 16 ఔన్సుల సీసాలలో దొరకును 25, 60 సైజులలో కాప్సూల్సుగాకూడ లభించును. మీకు సెవెన్‌సీస్ దొరకక పోతే మా యేజంట్లకు వ్రాయండి.

కార్ అండ్ కంపెనీ లిమిటెడ్,
ఇంపీరియల్ ఛేంబర్సు, విల్సన్ రోడు,
బెల్లార్డు ఎస్టేటు, బొంబాయి.

జోధ్‌పూర్ కమర్షియల్ బ్యాంక్ లిమిటెడ్.

(జోధ్‌పూర్ సంస్థానములో ఇన్‌కార్పొరేటు చేయబడినది. మెంబర్ల బాధ్యత పరిమితమైనది.)

హెడ్డాఫీసు : జాలోరి గేట్, జోధ్‌పూర్. చేర్మన్ : నారాయణ లాల్ బన్సీ లాల్.

జారీచేసిన మూలధనం రు 1,00,00,000 | చెల్లించబడిన మూలధనం రు50,00,000

రిజర్వు ఫండు రు 5,00,000

సేవింగ్సు బ్యాంక్ అకౌంటులు:- సేవింగ్సు బ్యాంకు అకౌంటులకు 5 రూపాయలు తక్కువలేని రు 20,000/-ల వరకు, రోజువారి నిల్వలమీద సాలుకు 1½ వంతున గాని కలిపిన నెలసరి నిల్వలమీద సాలుకు 1½ వంతున గాని, డిపాజిటర్లు యిష్టప్రకారము వడ్డీ యివ్వబడును. వరుసగా రెండుసార్లకు మించకుండ డిపాజిట్లు తీసుకొనబడును. అన్నివిధములైన బ్యాంకింగు వ్యాపారము చేయబడును.

మద్రాసు బ్రాంచి,
26, గోవిందప్ప నాయక్ స్ట్రీట్.
సికింద్రాబాద్ బ్రాంచి,
కింగ్సువే, సికింద్రాబాద్ (దక్కన్).

సి. హెచ్. దివాన్జీ,
మేనేజరు.

వెగసిన్

చర్మములో తయారైనది.

డబ్బసము
మరియు
కోరింత
దగ్గులకు

50 ఏండ్ల పైగానుండి నిస్సంశయమైన చికిత్స. ఇంతులో ప్రమాదకర మైన మందు ఏమియు లేదు గనుక నిరపాయమైనది.

సిద్ధముగా అన్నిచోట్లను దొరకును.

ఇండియా, పాకిస్తానుకు
సోల్ యేజంట్లు:

Apothecary E. Taeschner's

For coughs, asthma and bronchial catarrh

Pertussin

whooping-cough

INFA LTD. P.O. BOX 1021 BOMBAY

# సంగ్రహ వార్తలు

## మచిలీపట్నం

ఈ పురపాలక సంఘంవారు నవంబరు 12-న సమావేశమై, ఈ నెల 2-వ తేదీ వరకూ కమీషనరుగ ఉన్న పి. నాగభూషణంగారు మునిసిపాలిటీకి, రేటు పేయర్లకు చేసిన సేవను ప్రశంసించుచున, తుఫాను తర్వాత పట్నంలో మంచి నీటి సరఫరాకు తోడ్పడినందుకు వైటరుసర్వీసు సిబ్బందికి, వారి అధికారి కె. ఎస్. ప్రకాశరావు గారికి కృతజ్ఞత తెల్పుచును తీర్మానించిరి. ప్రభుత్వ ఉత్తరువు ప్రకారం విద్యాపన్ను హెచ్చించుటకు కూడ నిశ్చయించిరి.

## నర్సారావుపేట

ప్రభుత్వము స్థానిక మార్కెటింగు సొసైటీవారికి సబ్‌సిడీక్రింద రూ 5000/-లు, భవనం నిమిత్తం రూ 5000/-లు మంజూరు చేసినట్లు తెలిసినది.

ఈ పట్టణ రాష్ట్రీయ స్వయం సేవక సంఘసభ్యులు, స్థానిక ప్రచారక్ కోళ్ళ రంగనాథరావుగారు నూజివీడుకు బదిలీ అయిన సందర్భమున నిన్న వారికి అల్పాహారవిందు చేసిరి. పట్టణ పెద్దలను కొందరిని గూడ ఆహ్వానించిరి. రంగనాథరావుగారు సంఘ సభ్యుల విధులను గురించి మాట్లాడిరి.

## మంగళగిరి

స్థానిక సబ్‌మేజస్ట్రేటుగారు ప్రొహిబిషన్ ఆక్టు క్రింద సరిగడ అప్పలస్వామికి 2 నెలలు, మొట్టుకోల ఘంటయ్యకు 6 వారములు, నందిగొల్లు సోమయ్యకు 3 నెలలు కఠినశిక్ష, సురపుల వెంకటప్పారెడ్డికి రు 100/-లు, క. వెంకటేశ్వర్లుకు రు 60/-లు, సెప్పల్లి నారాయణకు రు 50/-లు, యామని బ్రహ్మారెడ్డికి రు 50/-లు జుల్మానా విధించిరి.

## రాయదుర్గం

ఈ నెల 13 వ తేదీన బళ్ళారిజిల్లా కలెక్టరు యస్. వి. సుగవనంగారి అధ్యక్షతను ఇక్కడ ఒక బహిరంగసభ జరినది. బాలికాపాఠశాల ప్రధానోపాధ్యాయిని బి. కౌసల్యాదేవిగారు పాఠశాల అభివృద్ధికి అందరూ తోడ్పడాలనిరి, హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు సుందరయ్య రు స్త్రీ విద్య ఆవశ్యకత విషయమై ఉపన్యసించిరి. నిష్ఠాణిగారు ఆహారసమస్య విషయంలో పత్వరంగా కంట్రోలు తీసివేసి, రవాణా సౌకర్యాలు కలిగించి, ఇతర వ్యాపారస్తులమీదవుండే పన్ను భారాన్ని తగ్గించి, వారిలో వారికే పోటీ కలుగచేస్తే ప్రజలకు ఆహార దినుసులు చౌకగా దొరకునని ఒక మెమొరాండం సమర్పించిరి. నీటివసతి, విద్యుచ్ఛక్తి, రైతుల అవసరాలు మీటి విషయమై సౌకర్యాలు కావలెననికూడా, మెమొరాండంలో కోరిరి. కలెక్టరుగారు. అరగంటలో మాటలాడుచూ శాయశక్తుల ప్రజలకు తోడ్పడుతాఘనిరి.

కౌసల్యాదేవిగారి అభినందన వాక్యాలతో సభముగిసెను.

## ఆదోని

సుమారు 30 సంవత్సరములు స్థానిక హైస్కూలులో తెలుగు పండితుడుగ పనిచేసిన ఆంధ్ర విద్యావాచస్పతి, కావ్యభూషణ, విద్వాన్, సిద్ధాంతి, జ్యోతిషస్థాపక, తొగర్చేటి భాస్కరశాస్త్రి గారు, ఈ నెల 13 వ తేదీన తమ పదవి నుండి విరమించుకొనిరి.

హైస్కూలులోనే హెడ్‌మాస్టరు జె. హెచ్. మోజెస్‌గారును, విరమించుకొనిరి.

ఇరువురకును సన్మానములు జరిగినవి.

## తణుకు

పశ్చిమ గోదావరిజిల్లా, వృత్తి విద్యాబోధకుల సమావేశము నవంబరు 13 న ఇక్కడ పెయ్యేటి వేంకటేశ్వరరావు గారి అధ్యక్షతను జరిగినది.

ప్రభుత్వము లోగడ ప్రకటించిన కొత్త జీతముల స్కేలుసు, జేసర్లు, రద్దుచేసి, వృత్తి విద్యలో ఉత్తీర్ణులైన టీచర్లందరకు, ఎస్. ఎస్. ఎల్. సి. ఫస్టు గ్రేడ్, సెకండ్ గ్రేడ్ అర్హతలతో నిమిత్తంలేకుండా, అందరకు రు 50-2-90 స్కేలు ప్రకారం జీతము యివ్వవలసినదిగా ప్రభుత్వమును కోరుచూ తీర్మానము చేసినారు.

## అనకాపల్లి

స్థానిక శ్రీకన్యకాపరమేశ్వరి దేవస్థానములో గత సుక్రవారము లగాయతు మూడు దినములు ఆత్మతత్వ సంబంధించిన వేదాన్త సభలు జరిగినవి. శ్రీమాన్ కె. జె. కృష్ణమాచార్యులుగారు అధ్యక్షత వహించిరి. బ్రహ్మఋషి శివానందయోగి, స్వామి ప్రబోధానందస్వామిగార్లు ఉపన్యసించిరి. పురప్రముఖులు శ్రీ స్వాములవార్లను సత్కరించిరి.

ఆ సెంటరులో, ఐక్యరాజ్యసమితి ఆహార — వ్యవసాయ శాఖలలో ప్రముఖ పనిచేయుచున్న కొల్లూరు శ్రీ ప్రసాద నరసింగరావు గారికి స్థానిక ప్రముఖులు విందుగావించారు. ఈ సందర్భమున భోజనం కోస్తు మునసబు వెంకటేశ్వరరావుగారు అధ్యక్షత వహించిరి

13 వ తేదీన స్థానిక హిందూ విజ్ఞాన ప్రబోధ గ్రంథమాల ప్రారంభోత్సవము జరిగినది. సభకు మాలేపల్లి రామచంద్ర శాస్త్రిగారు అధ్యక్షత వహించారు. దివాకర్ల వేంకటావధాని, ఆకెళ్ళ సత్యనారాయణగార్లు ఉపన్యసించారు. వ్యవస్థాపకులు వేదుల పార్వతీశంగారి గ్రంథమాల ఆశయములు వలిబుచ్చారు. వేదుల వెంకట శాస్త్రి గారి వందనార్పణలతో సభ ముగిసినది.

## బళ్ళారి

బళ్ళారి వస్త్రవ్యాపార సంఘ కార్యదర్శి గురునీశెట్టి మునెయ్యగారు లోగడ ఉండిన 20% లాభములో 6% తగ్గించినందువలన, సాధారణ వ్యాపారస్థులపై మొయ్యలేనంత బరువుమోపబడెననియు, దీనికి బదులు, టోకువ్యాపార కళాశాలైనీ, టోకు వ్యాపారులపైన అమ్మకపు పన్నును తొలగించినచో, ఇతర రాష్ట్రములలో నున్న పద్ధతిలో సమానముగా నుండుననియు, బొంబాయిలో అమ్మకం పన్ను ఒకచోటే పెట్టియున్నదనెడి ఆదర్శమును మరవరాదనియు, ప్రభుత్వమునకు సూచించిరి.

## నర్సాపురం

స్థానిక సబ్‌కలెక్టరు యి. పి. రాయప్పగారు బదిలీ అయినందున నిన్న వారికి వీడ్కోలు సభజరిగెను. సుమారు 2000 ప్రజలు హాజరయిరి. నరసాపురం పంచాయితీ బోర్డు అధ్యక్షుడు సభకు అధ్యక్షత వహించిరి. యామినీపూర్ణ తిలక గానసభతో సమావేశము ప్రారంభమయ్యెను. రాయప్పగార్కి పట్టణకాంగ్రెసుసంఘం, పంచాయితీబోర్డు, రైల్వే అసోసియేషను బ్రాహ్మణ రక్షసంఘం, ఉపాధ్యాయుల సంఘం, ముస్లిం అసోసియేషనులు రైతులు హైస్కూలుకమిటీ, నర్సాపురం కాలేజీ కమిటీవారలు వీడ్కోలు పత్రికములు ఒసంగిరి. పశ్చిమగోదావరి జిల్లాకలెక్టరు షేక్ అహమ్మద్ గారుకూడ సభకు విచ్చేసిరి.

డాక్టరు మల్లాది రామమూర్తిశాస్త్రి, డాక్టరు తోలేటి వేంకటరాజు, వంగూరి సుబ్బారావు, యర్రమిల్లి నారాయణమూర్తిగార్లు, ఉపన్యసించుచూ, రాయప్పగారి ప్రజాసేవ, ఋజువర్తన, బీదసాదల ఎడల ప్రేమ మొదలైన గుణములగురించి వివరించిరి.

ఈ గ్రామంలో యింతవరకు యే ప్రభుత్వాధికారికిని యింతఘనమైన పౌరసన్మానము చేయలేదు.

అనంతరము రాయప్పగారిని, మేళతాళములతో ఊరేగించిరి.

## గుత్తి

స్థానిక రజకజన సేవాసంఘువార్షికోత్సవం నవంబరు 12-న జి. వై. యల్లప్పగారి అధ్యక్షతను జరిగింది. పగడాల లక్ష్మయ్య జేసువరపు వెంకటేశ్వరులుగార్లు పాల్గొని రాయలసీమలో రజకులకు జరుగుచున్న అన్యాయమును గురించి, రజకుల ఈనాటి ఆర్థిక జీవితమునుగూర్చి విపులీకరించి, ప్రతిచోట సంఘాలు స్థాపించుకొనకపోయినయెడల రజకుల స్థితి మరీ అధ్వాన్నంగా ఉంటుందని హెచ్చరించారు. బి. నారాయణప్పగారుకూడా మాట్లాడారు.

రజకులపై వృత్తిపన్ను రద్దుచేయాలని, ప్రతి గ్రామంలోను వృత్తిసౌకర్యంకొరకు ఒక చెర్వు రజకసంఘానికివ్వాలని తీర్మానాలు చేస్తూ, రాష్ట్రసంఘానికి రు 116/- విరాళం ఇచ్చుటకు అమోదించారు. నూతన సంవత్సరమునకు జి. వై. ఆంజనేయులుగార్ని అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు.

## గుడివాడ

ఓళ్ళపాడు అగ్రహారికులు ఉపద్రష్ట పాపన్నశాస్త్రిగారు తుపాను బాధితులైన ఓళ్ళపాడు, గంగాధరపురం గ్రామాల ఆది ఆంధ్రులు తదితరగీదలకు బియ్యం, ధాన్యం ఉప్పు, మిరపకాయ, చింతపండు వస్త్రాలు ఉదారంగా పంచిపెట్టిరి. కలవపూడి అగ్రహారంలోని శ్రీ అమృతేశ్వర స్వామివారి 6 అంతస్తుల రథము మొన్న గాలి వానకు విరిగిపోయింది.

## రాజమహేంద్రవరం

రంగ్రీజాపేట యువజన కాంగ్రెస్ ఎన్నికలు నవం 19 న జరిగినవి. అధ్యక్షుడుగ బంధుచోడె శ్రీరాములు, ఉపాధ్యక్షుడుగ కూనల సీతయ్య, కార్యదర్శిగ నాగాబట్ల సుబ్రహ్మణ్యశర్మ, సహాయకార్యదర్శిగ పల్లపోలు వీరభద్రరావు, బంధుచోడె నారాయణరావు, కోశాధికారిగ పోలవరపు శ్రీరాముగార్లు ఎన్నుకోబడిరి.

## భీమవరం

స్థానిక కళాశాలవిద్యార్థి మహమ్మద్ ఖాదర్ నవం 19 అకస్మికంగా మరణించినందున 19 ఉదయం కళాశాల మూయబడెను. విద్యార్థులు సానుభూతి సభజరిపిరి.

కళాశాల యంగ్ సోషలిస్టు లీగు సభ్యులు ప్రకాశం భవనంలో సమావేశమైరి. రాజగోపాలం అధ్యక్షుడుగా ఎన్నుకొనిరి.

## నర్సారావుపేట

స్థానిక శ్రీ పట్టాభిరామస్వాములవారి ఆలయంలో సమర్థ రామసప్తాహము జరిగెను. రామాయణ కాలక్షేపము, పాటకచ్చేరి, సహస్రనామార్చన మొదలగునవి జరిగెను.

# బియ్యం రేషన్‌లోని గోధుమ

## 1 ఔన్సునైనా విధిగా తీసుకోవాలట

మద్రాసు, నవంబరు 21: ఇప్పుడు బియ్యం రేషన్లలో యిస్తున్న 2 ఔన్సుల గోధుమలలో కనీసం 1 ఔన్సునైనా విధిగా తీసుకోవాలని, అలా తీసుకోనివారికి బియ్యం యివ్వగద్దని, మద్రాసు ప్రభుత్వము ఉత్తర్వుచేసినట్లు తెలియవచ్చింది. ఈ ఉత్తర్వు రాష్ట్రమంతటికి వర్తిస్తుంది.

మదరాసు, నవంబర్ 21: మద్యపానం అలవాటు తప్పించుకోలేని వారికి డాక్టర్ల సర్టిఫికెట్‌పైన, సాలుకు రూ50/- పుచ్చుకొని 4 సీసాల సారాయి కొనుక్కొనేందుకు ప్రభుత్వం యింతవరకూ అనుమతి యిస్తున్నది. ఇప్పుడీ పర్మిట్ మూల్యాన్ని 500 పెంచి డాక్టర్ల సర్టిఫికెట్ లేకుండా ఎవరికైనా పరే సారాసీసాలను కొనుక్కొనేందుకు ప్రభుత్వం అనుమతి యివ్వదలచినట్లు తెలుస్తున్నది.

# తూ. గో. జిల్లా ఏజన్సీబోర్డు సమావేశం

భద్రాచలం, నవంబరు 19: తూర్పు గోదావరిజిల్లా ఏజన్సీబోర్డు అసాధారణ సమావేశము స్థానిక సబు-కలక్టరు ఆఫీసులో మొన్న జరిగినది. బోర్డు అధ్యక్షులు వి. వీరభద్రరావుగారు అధ్యక్షత వహించిరి. రాబోవు వైకుంఠ ఏకాదశి మహోత్సవమునకు కావలసిన సదుపాయాల నిమిత్తం రు. 500 లు మంజూరుచేయుచూ తీర్మానించిరి. (స్వ. వి.)

# కాకినాడలో చక్కెర క్షామం

కాకినాడ, నవంబరు 19: ఇక్కడ పంచదార మూడువారాలనుంచి బొత్తిగా దొరకుటలేదు. ఈ వారంలో ప్రయివేటు వర్తకులకు రెండుకీ మూడేసి బస్తాలపంచదార చొప్పున సరఫరా అయింది. మామూలుగా పంచిపెట్టే సహకారసంఘాలన్నిటికీ యీ పంచదార కోటాయివ్వలేదు. వర్తకులు ఒకగోజుమాత్రము అమ్మి తర్వాత పంచదారలేదని బోర్డుకట్టేశారు. నగరంలో ఒకవంతు ప్రజలకుకూడ పంచదార లభించలేదు. అధికారులు కిరసనాయిలు రేషనుకార్డు ఒక్కొంటికి అరవీశె పంచదార చొప్పున లెక్కగట్టి పంచదారకోటా యిద్దామని చెప్పుచున్నారు. ఇదిగాక ఒక చివర ఉన్నవారు ప్రజలకు పంచదార తీసుకోవలసిన కోటావానున్న కొట్టు మరోవార్డులో అరమైలు దూరాన కూడ ఉన్నది ప్రజలు చాల యిబ్బంది పడుచున్నారు. అధికారులకీ విషయము లన్నీ అర్జీలద్వారా తెలుపబడెను.

# యడ్లపల్లి కూనీకేసులో ముగ్గురి అరెస్టు

తెనాలి, నవంబరు 15: ఈతాలూకా యడ్లపల్లిలో ఆలపాటిసౌభాగ్యమ్మ హత్య సందర్భంలో, ఆలపాటి వెంకట సుబ్బారావు, కోనల్లి సుబ్బన్న, కుక్కల రోశిరెడ్డి అనువారిని ఈ తాలూకా పోలీసు సర్కిల్ ఇనస్పెక్టరు నరదరాజు, సబిన్స్పెక్టరు పి. శేషయ్యగార్లు అరెస్టుచేసిరి సబ్ జైలులో రిమాండులో నుంచిరి.

గుంటూరు జిల్లాజడ్జి అబ్‌దాస్ సత్తార్ సాహెబుబహద్దరు గారు స్థానిక జిల్లామున సబుకోర్టు తనిఖీ నిమిత్తము మొన్న యిచ్చటకు వచ్చిరి. స్థానిక న్యాయవాది సంఘంవారు జడ్జిగారికి అల్పాహారవిందు ఏర్పరిచి అందు యిటీవల యీ పట్టణమున స్థాపించిన సబ్‌కోర్టును శాశ్వతముగా యిచ్చటనే వుంచునట్లు చూడవలసినదని కోరిరి. లెక్కలనుబట్టి చూడగా దానిని ప్రభుత్వమువారు యిచ్చటనే వుంచుటకు వీలుగానట్లు తమకు తోచుచున్నదని జడ్జిగారు జవాబు చెప్పిరి.

## మార్కాపురం

కర్నూలు జిల్లాబోర్డు అధ్యక్షుడు బి. వి. సుబ్బారెడ్డిగారి గౌరవార్థము ఈ పుర ప్రముఖులు పాలుట్ల విశ్వనాథరావు, పి. సుబ్బరామయ్య, పి. యం మహబూబ్ బేగ్, నరశిరెడ్డిగార్లు 12 వ తేదీన విందొసగిరి. ఈ విందులో జిల్లాకలెక్టరు పి. వి. చలపతి మొదలియార్ ప్రభృతులుపాల్గొనిరి.

## కడప

కడప జిల్లాబోర్డు సభ్యుడు వి. కొండారెడ్డిగారు జిల్లాబోర్డు పక్షమున చెన్నపురి విశ్వవిద్యాలయ సెనేటు సభలో సభ్యుడుగా ఎన్నికయిరి.

ఈనెల 9-వ తేదీని మునిసిపల్ హైస్కూలులో 4 వ ఫారము చదువు యస్. భూమణమ్మ అను విద్యార్థి తన గుడ్డలపై కిరసనాయిలు పోసుకొని నిప్పంటించుకొని కాలిపోయెను. ఇతని వయస్సు 15 సం. ల్సరములు. పోలీసువారు విచారణ సలుపుచున్నారు.

కడప సివ్యుచే రిజిష్ట్రారు వి. గోపాలరావుగారు చేనేత సహకారసంఘములవారి సమావేశమును జరిపి సేలముజిల్లాలో చేనేత వారి సహాయమునకు ఏర్పాటు అయిన విధానమును వివరించిరి. ఆ స్కీమును ఈ జిల్లాకు విస్తరింపచేయవలెనని కోరుచూ ఒక తీర్మానము చేసిరి

# రామ్‌లాల్ మరణమునకు సంతాపం

## రోములోని భారతీయుల సానుభూతి

రోం, నవంబరు 20: ఇటలీ ప్రభుత్వ ప్రతినిధులు, రోం నగరంలోని విదేశ రాయబారులు, యీదేశ భారత రాయబారి కార్యాలయమునకు వచ్చి, భారత రాయబారి దివాన్ రమలాల్ మరణమునకు తమ సంతాపమును వెలడించారు.

ఇటలీ ప్రభుత్వ సంతాప సందేశములును, యుద్ధగు ఉద్యోగులు భారతరాయబారి కార్యాలయమునకు అందచేశారు.

రాజ మర్యాదలతో రేపు దివాన్ రామలాల్‌కు జరిగే అంత్యక్రియలకు ఇటలీ విదేశాంగమంత్రి హాజరవుతాడు.

దివాన్ రామలాల్ వయస్సు 62 సంవత్సరాలు. హృద్రోగంవల్ల వీరు యీ ఉదయం హఠాత్తుగా మరణించారు. ఈయన యిదివరలో తూర్పు పంజాబ్ హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేశారు. రోంలో రాయబార పదవిని స్వీకరించి రెండు నెలలే అయినది. రోంలో అంత్యక్రియలు జరిగినపిమ్మట, యీయన అస్థికలను, భారతదేశానికి తెచ్చి, గంగలో కలుపుతారు.

భారత రాయబార కార్యాలయ ప్రధాన సలహాదారు, ఆర్. యస్. మణి రాయబార పదవిని స్వీకరించుటకు రోంకు మరలి వచ్చాడు.

## తూర్పుపంజాబ్ హైకోర్టు మూసివేత

సిమ్లా, నవంబరు 21: ఇటలీలో భారత రాయబారి దివాన్ రామ్‌లాల్ మరణించినందుకు సానుభూతిసూచకంగా తూర్పు పంజాబు హైకోర్టు నేడు మూసివేయ్యబడింది. దివాన్ రామ్‌లాల్ 1947 లో తూర్పు పంజాబు రాష్ట్రం యేర్పడ్డప్పుడు, తూ. పంజాబు హైకోర్టుకు ప్రథమ ప్రధాన న్యాయమూర్తిగా నియోజింపబడినాడు. 1949 జనవరి 19 తేదీన న్యాయమూర్తి పదవినుంచి విరమించి, ఇటలీలో భారత రాయబారి పదవిని స్వీకరించాడు. తూర్పుపంజాబు హైకోర్టు న్యాయమూర్తులు, న్యాయవాదులు సమావేశమై, రామలాల్ గుణగణాలకు ప్రశంసించారు.

# తూర్పుపంజాబులో సాచార్ భాషా ప్రణాళిక

## హిందూ మహాసభ ప్రాతికూల్యము

అమృతసరసు, నవంబరు 20: తూ. పంజాబురాష్ట్రములో భాష విషయమై సాచారు తయారుచేసిన ప్రణాళికను ప్రతిఘటింప నే డిచ్చట సమావేశమైన హిందూ మహాసభవారి భాషా సమితి తీర్మానించెను.

సమితివారు ఈ క్రింది నిర్ణయములు గావించిరి.

(1) గురుముఖి నిర్బంధము చేయబడిన పాఠశాలలకు హిందువులు తమ పిల్లలను పంపరాదు. (2) పాఠశాలలలో నిర్బంధముగా పంజాబీ నేర్పవలెనని ప్రభుత్వమువారు పట్టు బట్టియెడల ప్రభుత్వగ్రాంటు నిరాకరింపవలెనని ప్రయివేటు పాఠశాలలవారిని కోరుట. (3) గురుముఖి భాషను నిర్బంధము చేయుటకు అసమ్మతి దెల్పుటకై రాష్ట్రమందంతట ఒకనాడు సభలు, ప్రదర్శనలు జరుపుట. (4) సాచార్ ప్రణాళికను అనాచరణీయమైనదిగా చేయుటకు 51 మందితో కూడిన ఒక సంఘము నేర్పరుచుట. (5) పండిత నెహ్రూ, సర్దార్ పటేల్‌గారల యొద్దకు రాయబారమువెళ్లి సాచర్ ప్రణాళికను అమలు చేయుటకు తోడ్పడరాదని వారిని కోరుట. (6) హిందువులు ఒకరితో నొకరు మాట్లాడునప్పుడు, జాబులు వ్రాయునప్పుడు హిందీని ఉపయోగింపవలెనని కోరుట.

కావలెను

పడుగుపాములో (నెల్లూరుజిల్లా) మా ఆంధ్ర దైనిక సచిత్రవార భారతి మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు న్యూసు ఏజంట్లు కావలెను. వివరములకు:

మేనేజరు,
ఆంధ్రపత్రిక, జి. టి. మద్రాసు.

భారత్ బ్యాంక్ లి॥:

హెడ్‌ఆఫీసు: ఢిల్లీ

చెల్లించిన మూలధనం
రు 2,01,87,175

రిజర్వు ఫండు
రు 40,00,000

మీ ప్రదేశంలోని మా ఆఫీసు వారు మీ బ్యాంకింగ్ సమస్యలను సంతోష పూర్వంగా తీర్చెదరు

BB

వేళమంగటా బ్రాంచి వరకు

అగురు

మనోహరమైన పరిమళముగలది.

AGURU

శ్రేష్ఠమైన సుగంధ ద్రవ్యముంతో తయారు చేయబడి మనోహరమైన పరిమళము నొసగును. భారతదేశ సుగంధ ద్రవ్యములలో అగురు దాం పేరొందినది.

బెంగాల్ కెమికల్
కలకత్తా బొంబాయి

ఏజంట్లు:
ఎ. దేశాయిగౌండర్ అండ్ కో.,
41. బందరువీధి, మదరాసు.

కావలెను

మద్రాసులోని ఒక ఆదర్శ మగు జనరల్ ఇన్సూరెన్సు సొసైటీకి ఏజంట్లు కావలెను. సొంతమైన వ్యాపారమును సంపాదింపగలవారే దరఖాస్తు పెట్టవలెను. మంచి కమీషనుగాని జీతముగాని యివ్వబడును. ఈ కంపెనీ అగ్ని, మోటారుల భీమా వ్యాపారము మ్యూచువల్ పద్ధతిమీద చేయుచున్నది. అనగా లాభము లన్నియు, భీమాదారులకే పంచిపెట్టబడును. వెంటనే దిగువ అడ్రెసుకు వ్రాయండి. బాక్సు నెం. 5/225 C/o ఆంధ్ర పత్రిక, మద్రాసు.

దగ్గును అపుటకు సుళికర మార్గము

సిరోలిన్ 'రోచ్'ని వాడుడు
హితకరము, రుచికరము

SIROLIN
REGISTERED
'ROCHE'

'రోచ్' తయారు

ప్రతి ఇంటిలో - ప్రతి వారికి

కావేరీ బార్ సబ్బు

ఉపయోగించుటకు సుస్థిరంగా నెలకొన్నది.

తయారుచేసినవారు:

మెట్టూర్ కెమికల్ & ఇండస్ట్రియల్ కార్పొరేషన్ లి.,
మెట్టూర్ డాం, సేలం జిల్లా

సోల్ సెల్లింగ్ ఏజంట్లు:

అల్లయిడ్ యిండస్ట్రియల్ డిస్ట్రిబ్యూటర్స్ లిమిటెడ్,
120, ఆర్మీనియన్ వీధి, మద్రాసు-1.

## శిద్దాపురం చెర్వుక్రింద భూముల సాగు

### దఖలుపర్చు విషయమై కవున్సిల్లో ప్రశ్నలు

మదరాసు, నవంబరు 21 : నేడు లెజిస్లేటివు కవున్సిల్‌లో శ్రీ యస్. శంకరరెడ్డిగారి ప్రశ్నకు జవాబు ఇచ్చుచూ శిద్దాపురం చెర్వుక్రింది భూములను రాజకీయబాధితులకు ఇచ్చు విషయమై కర్నూలుజిల్లా కలెక్టరు నివేదికను ప్రభుత్వము పరిశీలించుచున్నదని విద్యామంత్రి శ్రీ కే. మాధవమీనన్ తెలిపిరి.

ఈ చెర్వుక్రింద 2 వేల యకరములు బంజరుగాపడియున్న మాటనిజమేననియూ, శిద్దాపురం సెటిల్‌మెంటుకు ఆకట్టియుంచినందున భూమి సాగుక్రిందకి తేబడలేదని అన్నారు.

ఈ భూమిని, నీటిని సద్వినియోగము చేసి ఆహారకొరవదినములలో కొంత ఆహారము పండించుటకు ప్రభుత్వము సత్వర చర్యలు తీసుకొనునా యను ప్రశ్నకు సమాధానమిచ్చుచూ ఈ సెటిల్‌మెంటులో సాగుకు లాయకి అయినభూమిలో వెయ్యియకరములు సెటిల్‌మెంటుకు వుంచి తతిమా భూమిని బయటివారికి శాశ్వతముగ ఇచ్చు విషయం ఆలోచనలోవున్నదని విద్యామంత్రి తెలిపిరి.

అదే సభ్యునికి జవాబు ఇచ్చుచూ కర్నూలుజిల్లా ఆత్మకూరు సబ్ తాలూకా కిసాన్ కాంగ్రెసు అధ్యక్షుడు, మరిద్దరు శ్రీ ఏ. రామిరెడ్డి, కే. చెంచురెడ్డిగార్లు స్థానిక రైతుల సహాయముతో సెటిల్‌మెంటులో వ్యవసాయము చేయుదుమని చెప్పిరని కూడా మంత్రిగారు తెలిపిరి.

## జమీందారీశిస్తు వసూళ్లు

మదరాసు, నవంబరు 21 : శిస్తు తగ్గింపు చట్టము, జమీందారి రద్దుచట్టము చేసిన తరువాత శిస్తులు వసూలుచేయుట అసాధ్యముగా యున్నదని కొంతమది భూఖామందులు విన్నవించుకొనిరని నేడు కవున్సిలులో రివిన్యూమంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారికి తెలిపిరి.

శిస్తు వసూళ్లవిషయములో ప్రభుత్వము తీసుకొనిన చర్యలను వివరించుచూ శ్రీ సీతారామరెడ్డిగారు భూస్వాములతో సంప్రతించి ప్రభుత్వము 1949 మార్చి నెలలో 75% శిస్తును భూస్వాములకు ఇవ్వవలసినదని రైతులకు సలహాయిచ్చుచూ ఒక ప్రకటన చేసినదనీ, మరల మేలో మరొక ప్రకటన చేసినదనీ ఈ ప్రకటనవలన పరిస్థితి కొంత చక్కబడినదని తెలిపిరి.

భూస్వాములు ప్రభుత్వమునకు ఇవ్వవలసిన పేష్‌కష్, సెస్సులు పూర్తిగ ఇవ్వలేకపోయిరనికూడా అనిరి.

1357, 58 ఫసలీల తాలూకు పేష్‌కష్, సెస్సుల డిమాండు, వసూలు వివరములు తెలుపుచు మంత్రిగారిట్లు తెలిపిరి 1357 ఫసలీలో పేష్‌కష్‌డిమాండు రు 47,35,659 సెస్సు డిమాండు రు 46,59,447. 1358 ఫసలీలో పేష్‌కష్ డిమాండు రు 46,99,059 సెస్సు డిమాండు రు 46,44,998 1357లో పేష్‌కష్ వసూలు రు 31,55,893 సెస్సు వసూలు రు 23,70,165 ; 1358 లో పేష్‌కష్ వసూలు రు 15,49,849 సెస్సువసూలు రు 11,24 228 లు.

శిస్తులను ప్రభుత్వమే వసూలు చేయుట గురించి గాని, స్వాధీన పరచుకొనవలచిన ఎస్టేటులో శిస్తు బాకీలను వసూలు చేయుట గురించిగాని ప్రభుత్వము పరిశీలించినదా యను ప్రశ్నకు సమాధానముగా రివిన్యూమంత్రి శిస్తు తగ్గింపుచట్టం సెక్షన్ 5(4) జమీందారీ రద్దుచట్టము సెక్షన్ 55 నా సభ్యుడు గమనించగోరిరి. సెక్షన్ 55 క్రింద వసూళ్ళనంది పెషేష్‌లు సెస్సులు మినహాయించుట లేదనిరి.

పెష్‌కష్‌లోవాపసుఇచ్చే ప్రసక్తియుండదనీ, శిస్తుతగ్గుదలలోపాటు సెస్సులుకూడ తగ్గగలవనియూ, శిస్తు తగ్గింపు ఫలితముగా తగ్గేభూమి, విద్యసెస్సులకు బదులు స్థానిక సంస్థలకు పరిహారమేమీ ఇచ్చే ఆలోచన లేదనిరి.

శ్రీ మోతే నారాయణరావుగారి అనుబంధ ప్రశ్నకు బదులు ఇచ్చుచూ అన్ని ఎస్టేట్లు ఎప్పటిలోగా వశపరచుకొనునదీ తెల్పుటకు వీలులేదనియూ అయితే ప్రభుత్వము లోగడ ఉద్దేశించినట్లు సంవత్సరము లోగా తీసుకొనుట పూర్తి కావచ్చని మంత్రిగారనిరి.

ఆర్థిక ఇబ్బందులవలన ఎస్టేట్లను క్రమశః గాక మొదటిదశలోనే వశపరచుకొనగోరుచు కొంతమంది జమీందార్లు వ్రాసియున్నారాయని శ్రీ మోతే నారాయణరావుగారు అడిగిరి. తమ ఎస్టేట్లను స్వాధీన మొనర్చుకొనగోరుచు ప్రభుత్వమునకు వ్రాయాలనని అట్టి జమీందార్లను సూచించుచున్నారని రివిన్యూమంత్రి జవాబు ఇచ్చిరి.

### శ్యామలాటాకీస్ ప్రారంభోత్సవం

రాజమండ్రి, నవంబరు 19: ఇచ్చట నూతనంగా అలపాటి కొండ్రామయ్యగారిచే నిర్మింపబడిన శ్యామలాటాకీస్‌ను నిన్న జి. యన్. లక్ష్మీనారాయణన్ గారు (జిల్లాకలెక్టరు) ప్రారంభోత్సవం జరిపిరి. స్వ. వి.

## రాష్ట్రంలో ఆడపోలీసులు

### ప్రభుత్వవైఖరినిగూర్చి డా॥ రాజన్ సమాధానం

చెన్నపట్నం, నవంబరు 21 : ఆడ పోలీసులను నియమించు ఆలోచన జాగ్రత్తగాపరిశీలించిన తర్వాత ప్రస్తుతమునకు వాయిదా వేయబడెనని సభానాయకుడు డా॥ రాజన్‌గారు నేడు కౌన్సిలులో క్లబ్‌వాలాపతికి సమాధానముగా తెలిపిరి.

క్లబ్‌వాలాపతి :– చెన్నపట్నంలో వ్యభిచారం హెచ్చుగా ఉన్నందున కనీసం చారులనైనా నియమించెదరా ?

స :– ఇదివరకు ఒకఆమెను నియమించినాను. మిగతావిషయం ఆలోచింపబడును.

ప్ర :– మగపోలీసులను కొందరిని తీసి అరదజనుమంది ఆడపోలీసులను వేయరాదా ?

స :– అది సాధ్యమును పనికాదు.

ప్ర :– వద్దూ పాడివూ దృష్టి ఇతర విధాల ప్రయోజకులు అయిన స్త్రీలు దొరకకనా ?

స :– స్త్రీలు బలహీనతవల్లగాదు ఇతర కారణములవల్ల.

శ్రీ ఆర్. సూర్యనారాయణరావు : — ఈ ప్రభుత్వంవారు పూర్వాచారపరాయణులు అయినందువల్లనా ?

స :– ఎంతమాత్రమూ కాదు.

### బియ్యంమిల్లులు

చేబియ్యాన్ని ప్రోత్సహించటానికని కొన్ని ప్రత్యేకప్రాంతాల్లో బియ్యం మిల్లులు నిషేధించుఉద్దేశ్యంలేదనీ, అందువల్ల చేబియ్యాన్ని ప్రోత్సహించటానికి ఒకప్రణాళిక ఉన్నదా అన్నప్రశ్న రాదనియూ మోతే నారాయణరావుగారికి సమాధానముగా గ్రామోద్ధరణ మంత్రి తెలిపిరి.

హరిజన పత్రికలో మే 29 సెప్టెంబరు 25 తేదీలలో వనస్పతిగూర్చి వ్రాసిన వ్యాసములు ప్రభుత్వం గమనించినారని యూ పరిశోధనల ఫలితములు ఇంకా బయటబడనందున వనస్పతి పరిశ్రమను ప్రభుత్వము ప్రోత్సహించుట మానదనియూ రెవిన్యూమంత్రి బి. భీమారావుగారికి సమాధానముగా తెలిపిరి.

అర్ధిరేటుకు వ్యవసాయదారులకు సరఫరా చేయు సౌకర్యము నవంబరు 9 వ తేదీనుంచి కేంద్రప్రభుత్వ ఉత్తర్వుపై దేశములో ఏర్పడిన పరిస్థితులవల్ల రద్దు చేయబడెననియు, తుపాను బాధిత ప్రాంతములలో తిను ఎరువులు సప్లయి చేయబడుననియూ వ్యవసాయమంత్రి కేలూరి సుబ్బారామరెడ్డిగారికి సమాధానముగా తెలిపిరి.

1948 లో 3,855 రోడ్డు ప్రమాదములు జరిగెననియూ, అందు మరణించిన లేదా గాయపడినవారిసంఖ్య 279 ఉండుననియూ రవాణామంత్రి ఆర్. సూర్యనారాయణరావుగారికి సమాధానము తెలిపిరి. బాటసారులకు వాహనములు నడుపువారికి సూచనలు ప్రచురింపబడెననిరి.

## పురుషుడుగా మారిన స్త్రీ

న్యూయార్క్, నవంబరు 21 : శస్త్ర చికిత్ససహాయంలో 33 ఏళ్ళ వయస్సుగల స్త్రీపురుషుడుగా మారనున్నది.

ఎడ్నా గెసిస్కీ అనే పట్టభద్రురాలు, తానుతరచు గడ్డం చేసుకోవలసి వస్తున్న కారణంచేతవైద్యనిపుణుడి సలహాకోరింది. శస్త్ర చికిత్స చేయించుకోమని ఆయన సలహా ఇచ్చాడు. ఈమె ఎడ్నా అనే తన ఆడపేరును ఎవ్వర్డు అనే మగపేరుగా మార్చుకున్నది.

ఈమార్పునుగురించి వివరిస్తూ ఒకవైద్యవేత్త, ప్రతిశరీరంలోనూ స్త్రీ పురుషలక్షణాలుంటవనీ, జననానికిపూర్వమేవీటిలో ఏదో ఒకటి నిర్ధారణ అవుతుందనీ, ఈ గెసిస్కీ విషయంలో ఈ లక్షణాల సంఘర్షణ ఇంతకాలమూ సాగి చివరకు శస్త్రచికిత్సద్వారా నిర్ధారణ అయిందనీ అన్నాడు.

## ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్‌కు రష్యా ప్రతిపాదన

లండన్, నవంబరు 20 : ఇండియా, జపాను, పెర్షియా, ద. కొరియాలలో కార్మికోద్యమాన్ని బలపరచటానికై ప్రపంచ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ ఈ వివిధ దేశాలకు రాయబార వర్గములను సంపవలెనని రష్యా పెకింగ్‌లో జరుగుతున్న ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ సమావేశంలో ప్రతిపాదనచేసెను.

### హైదరాబాద్‌కు

### ఖాదరీ సేవ ప్రశంస

సంస్థాన నిమ్నజాతి సమాఖ్య అధ్యక్షులు పి. ఆర్. సుబ్బయ్యగారు మేజర్ జనరల్ ఖాదరీ సేవను ప్రశంసిస్తూ ఇలా అన్నారు: ఖాదరీగారు హైదరాబాద్‌లో స్వల్ప కాలం సువర్ణాక్షరాలతో లిఖించదగినది. ప్రజాస్వామిక పరిపాలనకు ఆయన పునాదులు వేశారు.



ఏలూరుతాలూకా కొమ్మిరెడ్డిగూడెంలో రామా వెంకట సత్యనారాయణ రైస్‌మిల్లులో తుపానుకల్ల 3 షెడ్లు, గోడలు యావత్తూ పడిపోయి, మిషనరీకి కూడా చాలా నష్టము వాటిల్లినది. సుమారు 15 వేల రూపాయల నష్టము కలిగెనదని అంచనా వేయబడినది.

## శాంతినికేతనంలో శాంతి వాదుల సభ

### నెహ్రూ ప్రసంగించే సూచన

కలకత్తా, నవంబరు 20 : శాంతినికేతనంలో రేపు డిసెంబరు 7 వ తేదీని సమావేశం కాబోయే శాంతి వాదుల సమావేశంలో ప్రధాన మంత్రి పండిట్ నెహ్రూ ప్రసంగించ గలరని తెలుస్తున్నది.

ఈ సమావేశ కార్యక్రమం ఇంకా పూర్తిగా నిశ్చయించ లేదు. అయితే ఇది శాంతినికేతనంలో 8 రోజులు జరగగలదనీ, ప్రతి రోజు ఒకొక్క అధ్యక్షుడు దీనికి అధ్యక్షత వహించ గలరనీ, పశ్చిమ బెంగాల్ గవర్నర్ కైలాసనాథ కట్జూ ఈ సమావేశం ప్రారంభించ గలరనీ తెలుస్తున్నది.

భారత నాయకులలో డాక్టరు రాజేంద్రప్రసాద్, శ్రీమతి సోఫియా వాడియా ప్రభృతులు ఈ సమావేశానికి రాగలరట.

ఈ సమావేశానికి పై దేశాల నించి దరిదరిగా 60 మంది ప్రతినిధులు వస్తున్నారు.

వీరు ఇంగ్లండు, ఆస్ట్రేలియా, అమెరికా, కనడాల వంటి 30 దేశాల నించి వస్తున్నారు.

అప్పుడే ఈ సమావేశానికి 18 గురు ప్రతినిధులు వచ్చారు. మిగిలిన వారు త్వరలోనే విమానాల మీద కలకత్తా రాబోతున్నారని తెలుస్తున్నది.

అబ్దుల్ గఫార్ ఖాన్ మొదలయిన కొందరు శాంతి వాదులకు పంపిన ఆహ్వానాలకు ప్రత్యుత్తరాలే రాలేదట. వీరు జైదులో ఉండడమే దీనికి కారణము.

### శాంతికాంగ్రెస్ ప్రతినిధుల సభ

కలకత్తా, నవంబరు 20 : అ. భా. శాంతి కాంగ్రెస్ ప్రతినిధుల సభ నవంబరు 24, 25 తేదీలలో జరుగునని ఆ సభ సన్నాహముల సంఘమువారు నేడు ప్రకటించిరి. నవంబరు 26, తేదీన బహిరంగ సమావేశము జైషారిక సమావేశము జరుగును. అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ అధ్యక్షుడును సన్నాహముల సంఘాధ్యక్షుడును అగు శ్రీ వి. చెట్టియారు నవంబరు 22 వ తేదీన వచ్చెదరు.

నేడు సన్నాహముల సంఘమువారు ఊరేగింపు చేసిరి. వేయిమందితో కూడిన ఈ ఊరేగింపు వీధులలో నినాదములుగావించుచు తిరిగి యెవరిళ్లకు వారు వెళ్ళిపోయిరి.

## ట్రాం చార్జీలను హెచ్చించటానికి ప్రయత్నం

మద్రాసు, నవంబరు 21 ; సిబ్బందివేతనాల ఖర్చు, పరిపాలనా ఖర్చులు పెరిగిపోతున్నందువల్ల మైలు 1-కి 0-0-9 చొప్పున వసూలు చేస్తున్న చార్జీని 0-1-0కు పెంచుటకు అనుమతించవలసిందిగా మద్రాసు ట్రాం వే కంపెనీవాళ్లు ప్రభుత్వాన్ని అడిగారు. అందుమీద ప్రభుత్వం, కార్పొరేషన్ కమీషనర్ నరసింహంగారిని ఏకసభ్య కమీషనర్‌గా నియోగించింది. 115108 పాళ్ల (48 లెఖ్ఖల ప్రకారం) రిజర్వుఫండు ఉన్నప్పటికీ ఏటేటా ట్రాం వే కంపెనీవాళ్లు లాభాలనుంచి ఎక్కువగా పంచుకొని రిజర్వు ఫండులో వేయడం ఎంతవరకు సమంజసమో, 0-0-9 చార్జీని 0-1-0 కు పెంచడం యెంతవరకు ఉచితమో విచారించాల్సిందిగా కమీషనర్‌ను ప్రభుత్వం ఆదేశించింది.

## పర్షియాబలపడితేనే మధ్యప్రాచ్యంలో శాంతి సురక్షితంగా వుంటుంది

### అమెరికన్ విలేఖరుల సభలో సుల్తాన్ ఉద్ఘాటన

వాషింగ్టన్, నవంబరు 20 : పెర్షియా రాజు మహమ్మద్ రెజాపహ్లావీ, ఇక్కడవున్న ఈ మూడు రోజులలోనే సార్వజనీకంగా పత్రికా విలేఖరుల ఆదరాభిమానలను చూరగొనగల్గెను. అన్నిటికన్న ఆయన ఆరమరికలేనితనం, మనసిచ్చి మాట్లేదే నిర్మొహమాట స్వభావం విలేఖరులకు ఆయనమీద చాలా సదభిప్రాయం కల్గించింది.

రష్యా పెర్షియాల సంబంధాలు, పెర్షియాకు అమెరికా సైనిక సహాయం మొదలైన వివిధ విషయములగురించి పత్రికా విలేఖరులు కురిపించిన ప్రశ్న పరంపరకు ఆయన తడుముకోకుండా నిస్సంకోచంగా సమాధానములు ఇచ్చెను.

రష్యా పెర్షియాల సంబంధాలు లోకసామాన్యమైన పద్ధతిగా సామరస్యంగా ఉండడానికి అభ్యంతరం ఉండరాదని పలికెను. అయితే పెర్షియా తన స్వాతంత్ర్యానికి వినిమయంగా ఈసామరస్యాన్ని సాధించగోరడం లేదనీ, తన సంపూర్ణ స్వాతంత్ర్యమును సంరక్షించుకోటానికి పెర్షియా కృతనిశ్చయమై ఉన్నదనీకూడా ఆయన చెప్పెను.

పెర్షియా స్వాతంత్ర్య సంరక్షణలోసాయపడాలని ఆయన విజ్ఞప్తి చేసెను. పెర్షియాను బలపరిస్తేనే మధ్య ప్రాచ్యంలో శాంతి సురక్షితంగా ఉంటుందని ఆయన చెప్పెను. పెర్షియా, కొరియా, ఫిలిప్పీన్ల సాయంకోసం అమెరికా పార్లమెంటు 2 కోట్ల 75 లక్షల డాలర్లు కేటాయించింది. ఈ మొత్తంలో ఒక యత్కించిత్తు భాగంలో పెర్షియా తృప్తిపడజాలదనీ, ఇంతకన్న అధికంగా అమెరికా తమకు సాయం చేయడం అవసరమనీ విస్పష్టపరచెను, అధ్యక్షుడు ట్రూమన్, విదేశాంగమంత్రి డీన్ ఆచిసన్ పెర్షియారాజు అభ్యర్థనను సానుభూతితో ఆలోచించారన్నది నిస్సందేహం. అమెరికా పెర్షియాలు పరస్పరం సహాయకారిగా ఉంటూ అన్యోన్యంగా మెలగగలవని తాను ఆశిస్తున్నాననీ ప్రపంచంలో దక్షిణపక్షాన్ని కూడా వామపక్షం అంత బలీయంగానూ చేయాలనీ, అధ్యక్షుడు ట్రూమన్ నిన్న పెర్షియా రాజుకు జరిగిన ఒక విందు సందర్భంలో ఉపన్యసిస్తూ చెప్పెను. తమకు ఇతోధికంగా ఆయుధసహాయం చేయవలసిన అవసరాన్ని ట్రూమన్ గుర్తించేట్లు చేయడంలో షా కృతకృత్యుడైనాడని అందరు అనుకుంటున్నారు. ప్రపంచంలో ప్రతిస్పర్ధివర్గాల మధ్య జరుగుతున్న పెనుగులాటల్లో పర్షియా వహించవలసిన పాత్రగురించి అధ్యక్షుడు ట్రూమన్ షాతో శుక్రవారం రాత్రి చర్చలు జరిపెనని తెలియుచున్నది.

## వచ్చేఏడాది ఈజిప్టులో ఎన్నికలు

కైరో, నవంబరు 21 : 1950 జనవరి 2 వ తేదీన ఈజిప్టు పార్లమెంటుకు ఎన్నికలు ప్రారంభమవుతవి. ఈజిప్టు జాతీయదినోత్సవమును ఆదరుగా రైకొని, అయా రాజకీయపార్టీలలో, తమ కార్యక్రమాలను వివరిస్తూ ఎన్నికల ప్రచారాన్ని సాగించుకొన్నవి.

వాఫ్డిస్టు, సాదిస్టు, లిబరల్‌పార్టీ నాయకులు, తమ తమ ఆశయాలనువివరిస్తూ ప్రజలంతా తమకు ఓటువేయవలెనని విజ్ఞప్తి చేశారు.

## మలయా దౌర్జన్యవాదులపై యుద్ధం

### తీవ్రతరం చేయబడునని బ్రిటిష్ పత్రిక ప్రకటన

లండన్, నవంబరు 20 : మలయాలో దౌర్జన్యవాదులపై యుద్ధచర్యలు తీవ్రతరం చేయబడునని "న్యూస్ ఆఫ్ ది వరల్డ్" అనేపత్రిక వ్రాసింది.

80 లక్షల ప్రతులు అమ్ముడుబోయే ప్రఖ్యాతపత్రిక యిది.

బ్రిటిష్ వలసరాజ్యశాఖా సహాయ కార్యదర్శి డేవిడ్ రీస్ విలియంతో యీ పత్రిక విలేఖరి సంభాషించి యీ దిగువ విషయాలను తనపత్రికకు పంపించాడు.

తనకు విధివిగా డాలర్లను సంపాదించి పెట్టే మలయాలో యిప్పటికి 18 మాసాలుగా ఎడతెగనియుద్ధం సాగుతుండడం బ్రిటన్‌కు కంటకంగా ఉన్నది. కనుక దీని సెలాగైనా తుడముట్టించాలనే దృఢసంకల్పంతో, దౌర్జన్యవాదుల నిర్మూలనకు పూనుకొన్నది. అరణ్యప్రాంతాలలో యుద్ధం చేయుటకు అనువైన సాధన సామగ్రిని, ఆయుధాలను, సాయుధ కవచశకటాలను తన సైనికులకు విరివిగా పంపుతున్నది. ముందు ముందు కొంత కాలందాకా తీవ్రపోరాటం జరుగవచ్చునని, యిప్పటికే దౌర్జన్యవాదుల వెన్నెముక విరుగగొట్టగలిగాము, అయితే వారిబలం యింకా పూర్తిగా నశించలేదని డేవిడ్ రీస్ విలియం, చెప్పారు. బ్రిటిష్ వారు, తమపట్లను మలయాలో పెట్టుబడి పెట్టాలనికూడా యీయన సలహా యిచ్చారు.

"మలయాలో జరుగుతున్నది జాతీయపోరాటం గాదు. దౌర్జన్యవాదులు సాగిస్తున్న హింసాకాండయే. ప్రజల విశ్వాసాన్ని చూరగొనకలిగామంటే, వారంతా మా అండచేరి మాకు తోడ్పడగలరు. వచ్చే యేడాది, బ్రిటన్ 25000,000 స్టర్లింగును, మలయాలో పరిశ్రమాభివృద్ధికి ఖర్చుపెడుతుంది. అక్కడ కోకో, మొదలైన అనేక పరిశ్రమలను అభివృద్ధి చేయుటయే మా సంకల్పం అని రీస్ విలియం తెలియజేశారు.

## ఫ్రెంచి సేనానితో మాల్కం మాగ్డొనాల్డ్ చర్చ

పారిస్, నవంబర్ 20: ఫ్రెంచి హై కమిషనర్‌తోనూడా ఇండోచైనాలో పర్యటిస్తున్న మాల్కం మెక్డొనాల్డు టాంకిన్‌లో వున్న ఫ్రెంచి సేనాని జనరల్ అలెస్సాండ్రీతో సమాలోచనలు జరిపారు.

మాల్కం మాగ్డొనాల్డు ఆగ్నేయ ఆసియాలో బ్రిటిష్ హై కమిషనర్‌గా వుంటున్నారు.

ఈ సందర్భంలో తాము ఉత్తర వియట్నాంలోని రాజకీయ సైనిక పరిస్థితులను గూర్చి చర్చించామని జనరల్ అలెస్సాండ్రీ అన్నారు.

ఆగ్నేయ ఆసియాలో ఇంగ్లో, ఫ్రెంచి సమిష్టి సైనిక విధానాన్ని గూర్చి ఏమన్నా చర్చించారా అన్న దానికి ఆయన ఏమి చెప్పకుండా వూరుకున్నారు.

## నిజాం నవాబుయెడ అనవసర కనికారం

### ప్రభుత్వవిధానంపై సోషలిస్టునాయకునివిమర్శ

వరంగల్, నవంబరు 19 : స్థానిక పింగిలివారి.పాఠశాలలో నిన్న సోషలిస్టుపార్టీ బహిరంగ సభ జరిగింది. సంస్థాన సోషలిస్టుపార్టీ కార్యదర్శి మహాదేవసింగు, ఆంధ్ర సోషలిస్టు నాయకుడు మండి జగన్నాథంగార్లు వచ్చారు. మహాదేవసింగు గారు ఇట్లా ఉపన్యసించారు.

ప్రజాభిప్రాయమును త్రోసివేసి నిజాం నవాబుపై దయచూపుచున్నారనీ ఏకమొటే లు అక్కర్లేకుండానే ఆయనకు 75 లక్షలు మంజూరు చేసిన ప్రభుత్వం, కిసాన్ మజ్దూర్ల కోరికలు తీర్చడానికి కమిటీలు పెట్టి చాలా ఆలస్యం చేస్తున్నది. హైదరాబాద్ వరంగల్‌లో 450 మంది కాంగ్రెసు కార్యకర్తలు లూటీ మొదలగు కేసులలో అరెస్టు చేయబడినారంటే సోషలిస్టు కమ్యూనిస్టులు ఒకటో, కాంగ్రెసు కమ్యూనిస్టులు ఒకటో ప్రజలే నిర్ణయం చేయవచ్చు.

పోలీసుచర్యకు పూర్వం రైతులు ఏవిధంగా బాధ పడేవారో నేడు సర్ఫెఖాసులు రద్దు అయినతర్వాత కూడా అదే అవస్థలో నున్నారు. ప్రభుత్వం యికముందైనా సత్వర చర్యలద్వారా ప్రజల దుర్భర స్థితిగతులను మార్చటానికి ప్రయత్నించకపోతే, అతి తొందరగా ఆ పని సోషలిస్టులే చేసి చూపిస్తారు. కావున ప్రజలంతా సోషలిస్టు పార్టీని దృఢతరమొనర్చి యింతవరకు కాంగ్రెసుకు యిచ్చిన దేశసేవావకాశం యివ్వండి. ఇతరు లుపన్యసించిన తర్వాత సభ ముగిసెను.

## సంస్థాన పోలీసులచే కాంగ్రెస్‌వర్కర్ల అరెస్టు

### రామమూర్తినాయుడు ఆమరణ నిరశనవ్రతం

సికంద్రాబాద్, నవంబర్ 20 : గత శుక్రవారంనాడు పోలీసులు కొంతమంది కాంగ్రెస్ సేవకులను అరెస్టు చేసినందుకుగాను నిరసనగా, ఆంధ్ర 'బి' రాష్ట్ర కాంగ్రెస్ సంఘ ప్రధానకార్యదర్శి రామమూర్తినాయుడుగారు నేటి ఉదయంనుండి ఆమరణ ప్రాయోపవేశం చేస్తున్నారు. ఈవిషయంలో జోక్యం చేసుకొని పై సేవకులనువిడుదల చేయవలసిందనికోరుతూ ఆయన భారత ప్రధానికి, ఉపప్రధానికి తంతి పంపారు.

"ఇటీవల సంస్థాన కాంగ్రెస్ ప్రతినిధుల ఎన్నికలలో అధికారపక్షంవారు జరిపిన దౌర్జన్యాలను నిరసిస్తూ కొంతమంది కాంగ్రెస్ సేవకులు శాంతియుత ప్రదర్శనను జరుపగా పోలీసులు తమ హద్దులను దాటి వారిని అరెస్టు చేశారు. ప్రభుత్వాధికార్లుకూడ కాంగ్రెస్‌లోని ఒక పక్షాన్ని దగ్గరకుతీసి రెండవపక్షాన్ని బాధించటం శోచనీయం. ప్రదర్శనకారులు రఘునాథబాగ్ నుండి బయలుదేరి తిరిగి అక్కడకు వచ్చి శాంతియుతంగా ఎవరివారిని వారు వెళ్లారు. వెంటనే పోలీసులువచ్చి ఏడుగురు కాంగ్రెస్ సేవకులను అరెస్టుచేశారు. వీరికి న్యాయం జరుగక పోయినచో ఆమరణ ప్రాయోపవేశం వినా నాకు గత్యంతరంలేదు" అని రామమూర్తినాయుడుగారు ఒక ప్రకటన చేశారు.

## అఖిలభారత న్యాయవాదుల మహాసభ

సికంద్రాబాద్, నవంబర్ 21: అఖిల భారత న్యాయవాదుల మహాసభ 1950 జూన్ 7, 8, 9 తేదీలలో హైదరాబాదులో జరుగుతుందని తెలుస్తున్నది దీనికి పూనా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు రైట్ ఆనరబుల్ డా॥ ఎం. ఆర్. జయకర్ అధ్యక్షతవహిస్తారని కూడ తెలుస్తున్నది.

సికంద్రాబాద్, నవం 21: గత శుక్రవారంనాడు కమ్యూనిస్టులు కాల్చి చంపిన సలార్ జంగ్ ఎస్టేటు కానిస్టేబుల్ శవము, ఒక విద్యార్థిశవము పోలీసులకు దొరికినవి. వాటిని వారి బంధువులకు యిచ్చివేశారు. ఈ అభాగ్యులు పొలం తగాదా పరిష్కారంకొరకు సూర్యాపేట నగర్‌కు 8 మైళ్ళ దూరంలోనున్న తమ పొలాలకు వెళ్లుతుండగా కమ్యూనిస్టులు దారిలో కాల్చి చంపారు.

## వల్లకొండలో కమ్యూనిస్టుల హతుకం

### ఒకనిని కాల్చి చంపుట

వరంగల్, నవంబర్ 21: జనగాం తాలూకా వల్లకొండ గ్రామంలో సాయుధ కమ్యూనిస్టులు ఈ నెల 14 న చల్లగుంట వెంకటరెడ్డి అను వతనిని కాల్చిచంపినట్లు తెలిసినది.

మానుకోట తాలూకా, గిద్దముప్పాల ములోని ఒక గుడిసెలో నిప్పు అంటుకొని వచ్చినందున సుమారు 42 యిండ్లు కాలిపోయినట్లు తెలిసినది.

## షోబుల్లాఖాన్ హత్యకేసు

### డిఫెన్సు సాక్షులకు సమన్లు పంపటానికి నిర్ణయం

సికంద్రాబాద్, నవంబరు 21 : షోబుల్లాఖాన్ హత్య కేసులో కాశింరజ్వీ, అబ్దుల్‌మునింఖాన్, మొహ్సిన్‌రజాలను విచారిస్తున్న ప్రత్యేక న్యాయ విచారణ సంఘంవారు నిన్న ఉదయం సమావేశమైనప్పుడు యీ సంస్థానంలోను, పాకిస్తాన్ లోను ఉన్న డిఫెన్సు సాక్షులకు సమన్లు పంపదలిచామని సంఘ అధ్యక్షుడు జె. ఏ. పింటోగారు ప్రకటించారు. ఇవి డిసెంబరు 17 లోగా వారికి చేరునట్లు పంపబడుతవన్నారు. ఈ విషయంలో హైదరాబాద్ ప్రభుత్వం అన్ని విధాలా సాయపడగలదనికూడ ఆయన ప్రకటించారు. "పాకిస్తానులో నున్న డిఫెన్సు సాక్షులకు యీనోటీసులు అందేటట్టు చెయ్యటానికి యీ ప్రత్యేకన్యాయ విచారణ సంఘం తనకు చేతనైనంత చెయ్యగలదు. ఒకవేళ అడ్రసులు సరిగాలేక ఆవివారికి చేరకపోతేగాని చేరినప్పటికీ యిక్కడకు రాకపోతేగాని అందుకు సంఘం చేసే దేమీలేదు. 'అని పింటోగారన్నారు.

ప్రస్తుతం పాకిస్తానులో నున్న కాశింరజ్వీభార్య బేగం రజ్వీ పాకిస్తాన్‌లో నున్న డిఫెన్సుసాక్షులతో యీ విషయంలో సంప్రదించగలదనీ, వారి నిక్కడకు పంపించే విషయమై శక్తికొలది ప్రయత్నించవలనలసినదని తాను ఆమెకు ఒక జాబు వ్రాయబోతున్నాననీ రజ్వీ న్యాయవాది నవాబ్ అస్కార్ యార్ జంగ్ చెప్పెను. తర్వాత కేసు డిసెంబరు 17 కి. వాయిదా వెయ్యబడిందిది.

## బీబీనగర్ కేసు

### మరియిద్దరు సాక్షుల విచారణ

సికంద్రాబాద్, నవంబర్ 21:— బీబీ నగర్ కేసు విచారిస్తున్న ప్రత్యేక న్యాయవిచారణ సంఘంవారు నిన్న సమావేశమైనప్పుడు మరి యిద్దరు సాక్షులు విచారింపబడినారు. హైదరాబాద్ సమాచారశాఖ మాజీ కార్యదర్శి హమీదుద్దీను అహమ్మద్ సాక్ష్యమిస్తూ, మీర్‌లాయక్ అలీ హైదరాబాద్ ప్రధానిగా ఉండగా తాను ఆ పదవిలో నున్నానని చెప్పెను. బీబీ నగర్ సంఘటన ఆరోజులలో కొన్ని స్థానిక పత్రికలలో "బీబీ నగర్‌పై హిందూ సాయుధులదాడి" కంటే పెద్ద పెద్ద శీర్షికలతో ప్రకటింపబడిందనీ, ఆ భాగాలను తీసుకొని గాజులపిందిగా లాయక్ అలీ తనకాదేశించెననీ చెప్పెను. వాటిని తీసుకొని ఇల్లగాడే ఫోనులో పోలీసు డైరెక్టరు జనరల్ (నవాబ్ దీన్‌యార్ జంగ్) పిలువ వలసిందని అతను చెప్పెను. ఫోనులో పోలీసు డైరెక్టరు చెప్పిన దానిని సమాచార శాఖ ద్వారా ప్రకటన నిమిత్తం పత్రికలకు పంపించటమయినది. ఈ పత్రికా ప్రకటనమీద దీనిని పోలీసుడైరెక్టరుయిచ్చాడనీ, యిది ప్రధాని ఉత్తర్వులకింద జారీ చేయబడుతున్నదనీ సాక్షి ఒకనోటు వ్రాసెను. కోర్టువారి కోరికపై సాక్షి ప్రకటనను బహిరంగపరచగా సాక్షి గుర్తుపట్టెను. 1948 జనవరి 13 ప్రభుత్వప్రకటన యిట్లున్నది. "బీబీ నగర్‌పై పెద్ద ఎత్తున సాయుధులదాడి అని శీర్షికతో కొన్ని పత్రికలలో ప్రకటింపబడినవార్తలు పూర్తిగా ఆధారరహితములైనవి. విచారణచెయ్యగా యీ కింది విషయాలు తెలిసినవి. ముస్లిం ప్రయాణీకులు కొంతమందితో ఒక లారీ సికంద్రాబాదు వైపు వస్తున్నది. ఈ ప్రయాణీకులు చేస్తున్న దేశభక్తియుతమైన నినాదాలను సహించలేకగా బీబీనగర్ రైలుస్టేషనులో కొంతమంది కేకలువేశారు. దీనిమీద ఒక చిన్న కొట్లాట జరిగింది. అంతేగాని ఆ ప్రయాణీకులు సాయుధులూ కారు. సాయుధ దాడీ లేదు. పోలీసులు వెంటనే తగుచర్య తీసుకొని పరిస్థితిని అదుపులోకి తెచ్చారు. ప్రస్తుతం బీబీ నగరం ప్రశాంతంగా వున్నది"

ఖాదర్ అలీఖాన్ అను పోలీసు అధికారి తర్వాత సాక్ష్యమిస్తూ, బీబీ నగర్ సంఘటన రోజున తాను భువనగిరిలో నున్నానని చెప్పెను. తాను నల్గొండ జిల్లా అడిషనల్ పోలీసుననీ, తన కార్యాలయం భువనగిరిలోననీ చెప్పెను. అతనికి స్వంత యిల్లు లేకపోవటం వలన ప్రభుత్వ బంగాళాలో వుంటుండే వాడు. ఆరోజున సాయంకాలం 4 గంటలవరకు కాశింరజ్వీ మరి వంద మంది సాయుధ రజాకార్లు అక్కడ ఉండి, తర్వాత సికంద్రాబాద్ బయలుదేరి వెళ్లారు.

అనంతరం కేసు రేపటికి వాయిదా వెయ్యబడింది.

ఫిర్కా కాంగ్రెసు ఎన్నికలలో తమకు ఓట్లు వేసే అవకాశం యివ్వలేదనీ, దూర గ్రామాలకూడా యీపోలింగ్ స్టేషన్‌లో హాజరుకావలసివచ్చుటవలన సమయం చాల లేదనీ, వరసింహారావు గారి నాయకత్వాన, సుమారు 100 మంది ఓటర్లు, సంస్థాన, రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులకు, జిల్లాపోలింగ్ ఆఫీసరుకు విజ్ఞప్తి పంపారు.

